19 & 20 యువ వసంతం - వర్షం
APRIL & JULY 1995



శ్రీమతి ఎ. జయప్రభ

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు
ఆర్వీయస్ సుందరం

# చైతన్య కవిత

## కవయిత్రుల ప్రత్యేక సంచిక.

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్ సుందరం

# చైతన్య కవిత

(కవయిత్రుల ప్రత్యేక సంచిక)

**19 & 20**

యువనామ సంవత్సరం

వసంత ఋతువు - వర్ష ఋతువు

చైత్ర మాసం - శ్రావణ మాసం

ఉగాది - జన్మాష్టమి

**1995**

**APRIL & JULY**

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

చైతన్య కవితా వేదిక

ఆర్ - 2, జ్ఞాన భారతి

బెంగుళూరు - 560056

CHAITANYA KAVITA ; a journal devoted to Telugu poetry. Published by Chaitanya Kavita Vedika, R-2, Jnana Bharathi, Bangalore University Campus, Bangalore - 560 056. April 1995.
PP. XII+72

ముఖ చిత్రం : ప్రముఖ స్త్రీవాద కవయిత్రి శ్రీమతి ఎ. జయప్రభ,
A-43, మౌలాలి రైల్వే కాలనీ, హైదరాబాదు - 560 040

అట్ట వెనుక : ప్రసిద్ధ సంఘ సేవకురాలు, సోషలిష్టు కార్యకర్త,
కీ. శే. స్నేహలతారెడ్డి, ('పఠాభి'గారి భార్య)

అక్షరాలంకరణ : పి. సి. నరసింహారెడ్డి, (తిరుపతి) మరియు బాపు (మద్రాసు)

| | | | |
|---|---|---|---|
| వెల : | విడి ప్రతి : | రూ. | 20-00 |
| | ప్రత్యేక సభ్యత్వం | రూ. | 200-00 |
| | జీవిత సభ్యత్వం | రూ. | 500-00 |
| | పోషక సభ్యత్వం | రూ. | 1000-00 |
| ప్రకటనలు : | రెండవ కవరు : | రూ. | 3000-00 |
| | మూడవ కవరు: | రూ. | 2000-00 |
| | పూర్తి పుట : | రూ. | 1000-00 |

For Copies :
**Prof . T. V. SUBBA RAO**
Department of Studies in Telugu
Bangalore University
Jnana Bharathi
**Bangalore - 560 056**

**Dr. R. V. S. SUNDARAM**
Department of Telugu
K. I. K. S. University of Mysore
Manasa Gangotri
**Mysore - 570 006**

DTP & PRINTED at **SREE LAXMI ART PRINTERS**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 **Ph : 3300 093**

# మనవి

'చైతన్య కవిత' కేవలం కవిత్వానికే అంకితమైన విశిష్ట పత్రిక. దీనిని 1986 ఏప్రిల్ నెలలో (అక్షయ ఉగాదినాడు) స్థాపించాం. ప్రముఖ కవుల ముఖచిత్రాలలో 1/8 డెమ్మీసైజులో, 60 పుటలకు తగ్గకుండా ఆరు మాసాలకొకసారి అందంగా వెలువరిస్తున్నాం - వసంత ఋతువులో (Spring) ఒకటి, శరదృతువు (Autumn) లో మరొకటి. మొదటి సంచిక 1986లో, మైసూరులో ఉన్న 'ధ్వన్యాలోక' అనే ప్రసిద్ధ సాహిత్య పరిశోధన కేంద్రంలో, విశ్వవిఖ్యాత ఆంగ్ల సాహిత్య విమర్శకులు ప్రొ. సి.డి. నరసింహయ్యగారి అధ్యక్షతన, ఆచార్య యస్వీ. జోగారావుగారిచే ఆవిష్కరించబడింది. అప్పటి నుండి ఇప్పటి వరకూ 18 సంచికలు వెలువరించాం. ఇది 19వ సంచిక ; కవయిత్రుల ప్రత్యేక సంచిక.

ఈ యువ నామసంవత్సర 'ఉగాది' నుండి 'చైతన్య కవిత'ను త్రై మాసికగా ప్రచురించాలని నిర్ణయించాం. ఆరు మాసాలకొకసారి 80-100 పుటల గ్రంథంగా వెలువరించేకన్నా, మూడు మాసాలకొకసారి 40-50 పుటల పత్రికగా వెలువరించడం మంచిదనే అభిప్రాయయానికి వచ్చాం. ఇక మీదట ప్రతి సంవత్సరం జనవరి, ఏప్రిల్, జూలై, అక్టోబరు నెలల్లో నాలుగు సంచికలుగా 'చైతన్యకవిత' వెలువడుతుంది.

నిన్న మొన్నటివరకూ చైతన్యకవితను మైసూరులోని 'మిత్రాప్రింటర్స్' అనే ప్రెస్‌లో ముద్రిస్తూ వచ్చాం. ఒక్కొక్క సంచికకు 6 వేల రూపాయలు చొప్పున ఇప్పటి వరకూ దాదాపు లక్షరూపాయలు ఖర్చు చేశాం. 15వ సంచిక నుండి దీనిని బెంగళూరులో DTP + Offset లో ముద్రిస్తున్నాం. ఇప్పుడు ఒక్కొక్క సంచికకు సుమారు 10 వేల రూపాయలు ఖర్చు పెట్టవలిసి వస్తోంది. కవిత్వంపై ఉండే పిచ్చి వ్యామోహంతో ఈ సాహసం చేస్తున్నాం.

ఇలాగ కవిత్వాన్ని మాత్రమే ప్రచురించే తెలుగు పత్రిక ఆంధ్రదేశంలో కాని, ఇతర రాష్ట్రాలలో కాని ఎక్కడాలేదు. దీనిని నిలబెట్టుకోవలిసిన బాధ్యత కవుల మీదా, కవిత్వాభిమానుల మీదా ఉంది. తమ తమ కవితలు పంపి సహకరించవలిసిందిగా కవులకూ, చందా దారులు కావలిసిందిగా సాహిత్యాభిమానులకూ, ప్రకటనలు యివ్వవలసిందిగా పారిశ్రామిక వేత్తలకూ ఇందుమూలంగా మనవి చేస్తున్నాం.

1995 సెప్టెంబరు 26వ తేదీ నాడు రాజమహేంద్రవరంలో ప్రసిద్ధ సాహిత్యవేత్త, కవి, పండితుడు, విమర్శకుడు, ఉత్తమ ఆచార్యుడు, 'అవధాన సుధాకరుడు', 'సభా సంచాలక సార్వభౌముడు' అయిన డా. బేతవోలు రామబ్రహ్మంగారికి '' ప్రతిభా వైజయంతిక పురస్కారం'' లభించింది. వారికి మా చైతన్య కవిత హృత్పూర్వక అభినందనలు తెలియజేస్తోంది. రామబ్రహ్మం గారి 'గురుదత్త లహరి' అనే పద్యాలు రాబోయే సంచికలో ప్రచురిస్తున్నాం.

1995లో సాహిత్యంలో నోబెల్ బహుమతి కవిత్వానికి రావడంకూడా చైతన్య కవితకు ఆనందదాయకమైన విషయం. ఐర్లాండ్ కవి ''సీమస్ హీనే'' (Seamus Heaney) ఈ బహుమతిగెలుచుకున్నారు. ఈ కవి కవితల్ని అనువదించి చైతన్య కవితలో ప్రచురించే ఏర్పాట్లు చేస్తున్నాం.

1995 ఫిబ్రవరి 25తేదీ నాడు హైదరాబాదులో ప్రసిద్ధ నయాగరా కవి ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారు ('ఏసు') పరమపదించారు. వారి కుటుంబానికి చైతన్య కవిత తన ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తోంది. ప్రఖ్యాత ఆంగ్ల కవి స్టీఫెన్ స్పెండర్ కూడా ఈ సంవత్సరమే గతించారు. ఇది ప్రపంచ కవి లోకానికి దుఃఖకరమైన వార్త. కీర్తిశేషులైన ఈ కవుల కవితల్ని కూడా త్వరలో పరిచయం చేస్తాం.

ప్రముఖ నవ్యాంధ్ర కవి, చలన చిత్ర దర్శక నిర్మాత, మా 'చైతన్య కవితా వేదిక' గౌరవాధ్యక్షులూ అయిన శ్రీ తిక్కవరపు పట్టాభి రామిరెడ్డి (పఠాభి) గారు కవయిత్రుల ప్రత్యేక సంచిక ఒకటి వెలువరించమని చాలా కాలంగా మమ్మల్ని కోరుతున్నారు. పరిస్థితులు కలిసిరాకపోవడం వల్లా, కవయిత్రుల నుండి సరియైన స్పందన లేకపోవడం వల్లా, ఈ సంచికను వెలువరించడంలో జాప్యం జరిగింది. దీనికి మిక్కిలి చింతిస్తున్నాం. ఇప్పటికైనా ప్రచురించగలిగినందుకు సంతోషిస్తున్నాం. ఈ ప్రత్యేక సంచిక యొక్క ముద్రణ వ్యయాన్నంతటినీ గొప్ప ఔదార్యంతో భరించడానికి ముందుకు వచ్చిన శ్రీ 'పఠాభి' గారికి మిక్కిలి కృతజ్ఞులం.

అనివార్యకారణాలవల్ల ముద్రణలో ఆరు మాసాల ఆలస్యం జరిగింది. అందువల్ల ఏప్రిల్ నెలలో వెలువడవలసిన 19వ సంచికనూ, జూలై నెలలో వెలువడవలసిన 20వ సంచికనూ కలిపి ఒకే సంయుక్త సంచికగా ప్రచురిస్తున్నాం. పాఠకులు మన్నించాలి.

'జ్ఞాన భారతి'

బెంగుళూరు — సంపాదకులు

3-10-1995 (విజయ దశమి)

# అంకితం

స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం
నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడి
చెఱసాలపాలై, అనారోగ్యపీడితురాలై,
'ఎమర్జన్సీ' కాలంలో ప్రాణాలు కోల్పోయిన
ప్రముఖ సంఘ సేవకురాలు, స్త్రీ వాది
ప్రసిద్ధ నవ్యకవి 'పఠాభి' గారి భార్య
అయిన
టి. స్నేహలతారెడ్డి గారి
దివ్య స్మృతికి......

- సంపాదకులు

# వసంత కోకిలలు - విద్యుల్లతలు

పుట

---

'' ఎందరు నర్తకుల్ని, చిత్రకారుల్ని, కవుల్ని, శిల్పుల్ని, యంత్రకారుల్ని, స్త్రీలలో తరతరమూ దేశం పోగొట్టుకుంటోందో! రాజ్యమేలగల స్త్రీలు కూడా అంట్లేతోముతున్నారు. ''

– చలం

---

# స్త్రీవాద కవిత్వం - ఒక పరిచయం

స్త్రీల సమస్యల మీద గౌతమ బుద్ధుని కాలం నుంచీ ( అంటే క్రీ. పూ. 6వ శతాబ్దం నుంచీ ) చర్చలు జరుగుతూనే ఉన్నాయి. 19వ శతాబ్ది వరకూ అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో కూడా స్త్రీలకు పురుషులతో సమాన ప్రతి పత్తి లేదు.

"Feminism" అనే పదం 17వ శతాబ్దిలోవాడబడింది. 'అని హబ్బిన్‌సన్' 'మేరీడైన్' అనే ప్రముఖ మహిళామణులు స్త్రీల కోసం మత విషయంగా సంస్కరణలు తీసుకురావడానికి ప్రయత్నించారు. 19వ శతాబ్దంలో అది ఉద్యమరూపం ధరించింది. అయితే అప్పటి పోరాటం కేవలం ప్రజాస్వామిక హక్కులు పొందేందుకు చేసింది మాత్రమే.

భారతదేశంలో పాశ్చాత్య ప్రభావం వల్ల బయలుదేరిన అనేక ఉద్యమాలలో ఈ Feminism ఒకటి. (దీనిని తెలుగులో 'స్త్రీవాదం' అనీ, 'స్త్రీ విముక్తివాదం' అనీ అంటున్నారు). స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా, సంఘ సంస్కరణలో ప్రధానంగా మహిళల అభ్యుదయానికి ఎంతో కృషి జరిగింది. బాల్య వివాహాలు, సతీ సహగమనాలు, స్త్రీ విద్యకు ప్రోత్సాహం లేక పోవడం, కన్యాశుల్కం, సాంఘిక అసమానత్వం, స్త్రీలను బాధించేవి. రాజారామమోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, రఘుపతి వేంకటరత్నం నాయుడు మొదలైన సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా స్త్రీల పరిస్థితిలో కొంత మార్పు వచ్చింది. 1917 లో స్థాపించబడ్డ ' Womens Indian Association ' మహిళోద్యమానికి ఎంతో సేవ చేసింది. స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీ పిలుపునందుకొని దేశం కోసం పోరాడిన నారీ రత్నాలు ఎందరోవున్నారు. అప్పటి స్త్రీల ఉద్యమాలు, స్వాతంత్ర్యోద్యమంలో భాగంగానే నడిచాయి. ఆంధ్ర దేశంలో కూడా 'స్త్రీవాదం' అనే పేరుతోకాకపోయినా, స్త్రీల అభివృద్ధికి, అభ్యుదయానికి ఎందరో స్త్రీ పురుషులు ఉద్యమాలు, పత్రికలు నడిపి స్త్రీలలో చైతన్యం కలిగించారు; అనేక మహిళా సంఘాలు స్థాపించారు.

స్వాతంత్ర్యానంతరం స్త్రీల పరిస్థితి, స్వాతంత్ర్యపూర్వం కన్నా ఎంతో మెరుగైన మాట వాస్తవమే అయినా, ఈ నాటికీ స్త్రీ, పురుషునితో సమానమైన స్థాయికి ఇంకా రాలేదనే చెప్పాలి. ఆ నాటి కన్యాశుల్కం ఈ నాటి వరకట్నంగా మారింది. నేటి ఆధునిక

సమాజంలో కూడా సతీ సహగమనం లాంటి రాక్షసాచారాలు జరుగుతున్నాయంటే (1987లో రాజస్థాన్‌లో ' రూప్ కన్వర్' అనే బి. యస్ సి. చదివిన యువతి సహగమనం చేసింది), కట్నాలు తీసుకురాని కోడళ్ళ హత్యలు జరుగుతున్నాయంటే, పట్టపగలు ప్రయాణం చేస్తున్న రైళ్ళలోనే మాన భంగాలు జరుగుతున్నాయంటే, కడుపులో ఉన్న పిండం స్త్రీ శిశువు అని తెలుసుకొని భ్రూణహత్యలు చేస్తున్నారంటే ఆశ్చర్యపడాలో, మనం సాధించిన ప్రగతికి సిగ్గుపడాలో తెలియడం లేదు. అయినా గత కొన్ని దశాబ్దాలుగా స్త్రీవిమోచన కోసం గట్టి కృషి జరుగుతోందని భావించడంలో తప్పు లేదు. మహిళా పత్రికలు, మహిళా సంఘాలు ఈ కృషిలో తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాయి.

**ఫెమినిస్టు ఆలోచనాధోరణి ఏమిటో తెలుసుకుందాం :-**

1 తన జీవితాన్ని ఏ రకంగా గడపాలో ఎంచుకునే అవకాశం స్త్రీకి వుండాలి. తను ఎలా ఉండాలనుకుంటుందో, తన జీవితాన్ని ఎలా మలచుకోవాలను కుంటుందో అటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నేటి స్త్రీ కోరుకుంటుంది.

2 ఆడపిల్లల్ని మగ పిల్లలతో సమానంగా చూడాలి. పెంపకంలో తేడా ఉండకూడదు. ఆడ పిల్ల లక్కపిడతలతోనే ఆడాలనీ, హోమ్ సైన్స్ కోర్సే చదవాలనీ, నాలుగు గోడలమధ్యేవుండాలనీ ఆంక్షలు పెట్టకూడదు.

3 స్త్రీలు తమ సెక్సువల్ల భిన్నదృష్టితో చూడబడకూడదు. సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా ఆడవాళ్లు మగవారితో సమానస్థాయిలో వుండాలి.

4 కుటుంబంలోనూ, సమాజంలోనూ, రాజకీయ పార్టీలలోనూ, అన్నింట్లోనూ ఆరోగ్యకరమైన పోరాటాలు చేపట్టినప్పుడే స్త్రీకి విముక్తి సాధ్యమవుతుంది.

5 ''ఎక్కడైతే స్త్రీకి ఎన్నుకునే స్వేచ్ఛవుంటుందో, ఎక్కడైతే ఆమె గృహిణిగా వుండాలని బలవంతం చేయబడదో, ఎక్కడైతే ఆమె ఆడవాళ్లపనుల్లోకీ, తక్కువ వేతనాల పనుల్లోకినెట్టబడదో, ఎక్కడ స్త్రీ అన్ని విధాలా గౌరవింపబడుతుందో, అటువంటి సమాజం కోసం ఫెమినిస్టుల పోరాటం'' (నాగమల్లీశ్వర రావు, 'ఫెమినిజం-కొన్ని ప్రశ్నలూ సమాధానాలు').

స్త్రీ సమస్యల మీద పురుషులు పోరాడితే వారు కూడా ఫెమినిస్టులే. ఆధునిక సాహిత్యంలో మొదటి ఫెమినిస్టు చలం. తెన్నేటి హేమలత, రంగనాయకమ్మ స్త్రీవిముక్తి కోసం సాహిత్యపరంగా పాటుపడిన రచయిత్రులు. ఈ నాడు మల్లాది సుబ్బమ్మగారు

స్త్రీ విముక్తి కోసం పాటుపడుతూ, మహిళాభ్యుదయ సంస్థలను నిర్వహిస్తూ, స్త్రీలు తెలుసుకోవలిసిన హక్కుల్ని గురించి, వారి విముక్తిని సాధించే ఉద్యమాల గురించి, ఉద్యమపరంగా, సాహిత్యపరంగా సవ్యసాచిలా కృషి చేస్తున్నారు. ఎ. జయప్రభ, కొండేపూడి నిర్మల, ఓల్గా, వసంత కన్నబిరాన్, విమల, ఘంటసాల నిర్మల మొదలైన కవయిత్రులు స్త్రీవాద కవిత్వాన్ని సర్వసంపన్నం చేస్తున్నారు.

1984 లో (మార్చి, ఆంధ్రజ్యోతి వారపత్రిక) 'సావిత్రి' అనే కవయిత్రి 'బందిపోట్లు' అనే కవితను ప్రకటించారు. 'గృహిణి' అనే కవిత కూడా వారే వ్రాశారు. ఈ రెండు కవితలలోనే స్త్రీవాదానికి నాందీ ప్రస్తావనలు జరిగాయని భావించవచ్చు. (అంతకుముందు విప్లవ కవిత్వంలో భాగంగా స్త్రీ వాద కవిత్వం కొంత వచ్చింది. ఉదాహరణానికి 'ఓల్గా' అనే కవయిత్రి 'పంచాదినిర్మల' అనే విప్లవకారిణిని దృష్టిలో పెట్టుకొని 'ప్రతి స్త్రీ ఒక నిర్మలకావాలి!' అనే కవిత వ్రాశారు. ఇది 1972 అక్టోబరులో 'ప్రభంజనం' అనే పత్రికలో ప్రకటింపబడింది. కాని దీనిని ప్రత్యేకమైన స్త్రీ వాద కవితగా గుర్తించలేము. ఇది విరసం రచనలలో ఒక భాగం మాత్రమే.) 1988 మే నెలలో ప్రకటితమైన ఎ. జయప్రభగారి 'వామనుడి మూడో పాదం' అనే కవితా సంపుటి తెలుగులో వచ్చిన మొట్టమొదటి స్త్రీ వాద కవితా సంపుటి. కొండేపూడి నిర్మలగారి 'సందిగ్ధ సంధ్య' అనే కవితా సంపుటి కూడా అదే సంవత్సరం వెలువడింది. అందులో కూడా కొన్ని స్త్రీ వాద కవితలున్నాయి. కాని జయప్రభగారికున్నంత నిబద్ధత నిర్మలగారి కావ్యంలో కనపడదు. కాని నిర్మలగారు 1990లో ప్రకటించిన 'నడిచేగాయాలు' అనే కవితా సంపుటి మాత్రం పూర్తిగా స్త్రీవాదానికి అంకితమైన కావ్యంగా చెప్పవచ్చు. 1990 డిసెంబరు మాసంలో త్రిపురనేని శ్రీనివాస్ సంపాదకత్వంలో ప్రకటింపబడిన 'గురిచూసి పాడే పాట' అనే కవితా సంకలనం ప్రసిద్ధ స్త్రీ వాద కవితలన్నింటినీ ఒక చోట చేర్చింది. ఇందులో 16 మంది కవయిత్రుల 25 కవితలు, ఒక తెలంగాణా జానపదగేయం ఉన్నాయి. జయప్రభగారు 1991 జనవరిలో 'ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది?' అనే కవితా సంపుటిని, 1993 జనవరిలో 'యశోధరా ఈ వగపెందుకే!' అనే కవితా సంపుటిని ప్రకటించారు. ఈ కవితా సంపుటులలో కూడా స్త్రీవాదాన్ని ప్రతిపాదించే ఉత్తమ కవితలు చాలా ఉన్నాయి. స్త్రీవాద కవిత్వాన్ని ప్రారంభించిన సావిత్రిగారు 1991 లో క్షయ రోగ పీడితురాలై అకాలమరణాన్ని పొందారు. తరువాత ఈమె రచనలన్నింటినీ ఈమె అభిమానులు సేకరించి, 'సావిత్రి' అనే పేరుతో 1992 లో పుస్తక రూపంలో ప్రకటించారు. ఇటీవల (అంటే 1993 అక్టోబరులో) 'నీలి మేఘాలు' పేరుతో ఒక మంచి స్త్రీ వాద కవితా సంకలనం వెలువడింది. దీని సంపాదకురాలు ''అస్మిత.''

1987-1990 మధ్యకాలంలో వచ్చిన స్త్రీవాద కవిత్వాన్నిగురించి శ్రీమతి కమలాకర రాజేశ్వరిగారు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి ఎం. ఫిల్. డిగ్రీన్ని పొందారు. వీరి పరిశోధన ప్రకారం స్త్రీవాద కవిత్వంలో 16రకాల భావజాలం కనబడుతుంది. 1) భ్రూణ హత్యలు 2) ఆడ పిల్లల పెంపకం 3) స్త్రీ హింస 4) పెళ్ళిచూపులు 5) వర కట్నాలు - చావులు 6) సతి 7) స్త్రీలు - మానభంగాలు 8) స్త్రీలు అందాలపోటీలు 9) గృహిణి గా స్త్రీ 10) ఉద్యోగినిగా స్త్రీ 11) వివిధ రూపాల్లో స్త్రీ 12) సంప్రదాయ నిరసన 13) స్త్రీల అణచివేత 14) స్త్రీ ఆత్మగౌరవం 15) స్త్రీ స్వేచ్ఛ 16) స్త్రీ చైతన్యం

స్త్రీ పురుషుల అకర్షణ ప్రకృతి సిద్ధమైనది. ఇద్దరూ వాగర్థాలవంటివారు. ఇద్దరూ కలిస్తేనే సృష్టి. జీవితంలోనూ, సంసారంలోనూ, సంఘంలోనూ ఇద్దరూ సమానంగా గౌరవింపబడాలి - అనేటంతవరకూ అందరూ ఒప్పుకోవాలి. స్త్రీలయందు ఏ విధమైన వివక్షా చూపకూడదనేది కూడా న్యాయమైన కోరికే. కాని స్త్రీ వాదాన్ని ఇంకా ముందుకు సాగదీసి, స్త్రీలకు పురుషులయందు ద్వేషం కలిగించే స్థాయికి మాత్రం చేరకూడదు. అలాగే పురుషులు అనుభవించే 'స్వేచ్ఛ' (సిగరెట్లు, త్రాగుడు, జూదం, వ్యభిచారం లాంటి స్వేచ్ఛ) తమకు కూడా కావాలని స్త్రీవాదులు కోరడం కూడా సమంజసమైనది కాదు. స్త్రీలైనా పురుషులైనా నిజమైన స్వేచ్ఛను పొందాలికాని, దురభ్యాసాలు, అవినీతి, దుష్ప్రవర్తన లాంటి స్వేచ్ఛకోసం ప్రయత్నించకూడదు. పురుషుడుచేసినంత మాత్రాన తప్పు ఒప్పు కాదు. తప్పు ఎవరు చేసినా తప్పే!

ఇంకొక విషయం కూడా గుర్తుపెట్టుకోవాలి. స్త్రీలను బాధించే పురుషులు ఉన్నట్లుగానే, పురుషుల్ని బాధించే స్త్రీలు కూడా వున్నారు. కాకపోతే వీరి శాతం తక్కువ కావచ్చు. మొత్తానికి స్త్రీ పురుషులు కలిసి బ్రతకవలసినవారు. ఈ సృష్టి అనే బండికి రెండు చక్రాలవంటివారు. ఒకరినొకరు గౌరవించుకుంటూ, స్వేచ్ఛను కలిగి వుండి, మంచి స్నేహితులుగా జీవించవలసినవారు. కాబట్టి స్త్రీవాదాన్ని తెగేవరకూ లాగడం కూడా అంత మంచిది కాదేమో!

– తంగిరాల సుబ్బారావు

– కమలాకర రాజేశ్వరి

# శ్రీమతి ఎ. జయప్రభ

## జీవనరేఖలు

| | | |
|---|---|---|
| జననం | : | 1957 జూలై 29వతేది, మహారాష్ట్రలోని నాగపూర్‌లో |
| విద్యాభ్యాసం | : | ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. (తెలుగు), ఎం. ఏ. (డ్రామా) ఎం.ఫిల్. ('భావకవిత్వంలో స్త్రీ') పిహెచ్. డి. ('యాభై ఏళ్ల తెలుగునాటకరంగం') 1989- 90-అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో తెలుగు బోధించారు |
| రచనలు | : | 1 'సూర్యుడు కూడా ఉదయిస్తాడు' (కవితలు) (సహరచన : శ్రీ విశ్వనాథ సూర్యనారాయణతో), 1980<br>2 యుద్ధోన్ముఖంగా (కవితలు)1986<br>3 వామనుడి మూడోపాదం, 1988<br>4 భావ కవిత్వంలో స్త్రీ, 1988<br>5 ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది? 1991<br>6 నాలుగో గోడ - తెలుగులో ఆధునిక నాటకం (గత యాభైయేళ్ళ తెలుగు నాటక రంగం మీద విశ్లేషణ), 1992<br>7 'యశోధరా ఈ వగపెందుకే!' (కవితలు),1993<br>8 'లోహిత' కర పత్రిక సంపాదకత్వం |
| అడ్రసు | : | చైతన్య - తేజ పబ్లికేషన్స్<br>A-43, మౌలాలీ రైల్వే కాలనీ<br>హైదరాబాదు - 560 040 |

# జయప్రభ కవితలు - స్త్రీవాదం

-కమలాకర రాజేశ్వరి

ఇటీవల స్త్రీ వాద ధోరణిలో కవితలు వ్రాస్తున్న వారిలో పేర్కొనదగినవారు శ్రీమతి జయప్రభ. ఈమె పుట్టింది నాగపూర్‌లో. ఉస్మానియా యూనివర్సిటీ నుండి **M. A., M.Phil. Ph.D.** డిగ్రీలు తీసుకున్నారు. 'భావకవిత్వంలో స్త్రీ' వీరి ఎం.ఫిల్. పరిశోధనాంశం. 'ఆధునిక తెలుగు నాటకము - ప్రభావాలు, ప్రయోగాలు' అన్న అంశం మీద **Ph.D** చేశారు. 'సూర్యుడుం కూడా ఉదయిస్తాడు' ( భర్త విశ్వనాథ సూర్యనారాయణతో కలిసి ) 'యుద్ధోన్ముఖంగా', 'వామనుడి మూడోపాదం' 'ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది?' 'యశోధరా ఈ వగపెందుకే?' అనే కవితా సంకలనాలు అచ్చయినాయి. ఇవే కాకుండా కవితలు, విమర్శనాత్మక వ్యాసాలు వివిధ పత్రికల్లో వచ్చాయి. స్త్రీవాద సాహితీ సమఖ్య తరపున ప్రకటింపబడే 'లోహిత' అనే పత్రికకు సంపాదకులుగా వున్నారు. స్త్రీవాదానికి సంబంధించిన అనేక కవితలు, వ్యాసాలు ఈ పత్రికలో జయప్రభగారు వ్రాశారు. తను 'ఫెమినిస్ట్' నని స్పష్టంగా చెప్పుకున్నారు ఆమె.

లైంగిక స్వేచ్ఛ స్త్రీ విముక్తి ఉద్యమంలో ప్రధాన భాగంగా జయప్రభగారు భావించారు. '' ఆదినుంచి పురుషస్వామ్య సమాజంలో ఆడదాని మీద హక్కు, ఆవిడ లైంగికత్వం మీద ఆధిపత్యం చెలాయించడం రూపంలోనే వ్యక్తమయింది. స్త్రీలు ఎవరితో ఎంతవరకు లైంగిక సంబంధాలు పెట్టుకోవాలి, ఎవరితో ఎంతవరకు పెట్టుకోకూడదు? స్త్రీ పిల్లల్ని కనాలా? వద్దా ? అయితే ఎవరివల్ల కనాలి? స్త్రీ లైంగిక సుఖం పొందాలా, కూడదా? - ఇలాంటి విషయాలు ఈ సమాజంలో పురుషుడు నిర్ణయించాడు. అందుచేతనే ఈ సమాజం నీతి వ్యవస్థ స్త్రీ శరీరాన్ని దోచుకోడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. పాతివ్రత్యం, నీతి, ఆడవాళ్లకి సంకెళ్ళని స్త్రీలు గ్రహించాలి''[1] అంటారు ఆమె.

అన్ని రంగాలలో లాగే కవిత్వంలో కూడా పురుషాధిక్యమే రాజ్యం చేసిందనీ, ఆడవాళ్లకి సంబంధించిన అన్ని అంశాల మీదా పురుషుడే వ్రాయడం వల్ల అవి నిజాయితీగా లేవనీ, అందుకే పురుషప్రభావం పడని ఆలోచనలతో ఆడవాళ్ళు ముందుకు రావాలనీ, తాను కూడా కవిగా కాక ఆడదానిగా కవిత్వం వ్రాస్తున్నానని అన్నారు[2].

ఆడవారి సమస్యలకు ఆడదానిగా తాను ఎలా స్పదించారో తన కవిత్వంలో పలికించారు. కవిత్వరంగాన ఉన్న పురుషాధిక్యం మీద తిరుగుబాటు చేస్తూ స్వేచ్ఛగా తమ భావాలను వెల్లడి చేశారీమె. వీరి 'వామనుడి మూడోపాదం' 36 కవితల సంపుటి. ఇందులో 5 కవితలు స్త్రీవాద ప్రభావితమైనవి. ఇవేకాక వివిధ పత్రికల్లో ప్రచురింపబడిన కవితలు కూడా మరి కొన్ని ఉన్నాయి. ఈమె వ్రాసిన స్త్రీ వాద కవితలు ఆరు భావాంశాలను ప్రధానంగా దృష్టిలో పెట్టుకొని వ్రాసినవి: స్త్రీ హింస, స్త్రీల అణచివేత, స్త్రీల ఆత్మగౌరవం, సంప్రదాయ నిరసన, భ్రూణహత్యలు, ఆడపిల్లల పెంపకం.

## 1. స్త్రీ హింస :

'వామనుడి మూడో పాదం 'లో 'చూపులు ' అనే కవిత ఉంది. ఇందులో మగవాళ్ళు చూపులతో ఆడవారి శరీరాలమీద జరిపే హింసను గురించి వ్రాశారు:

''రెండు కళ్లనుంచి
చూపులు
సూదుల్లా వచ్చి
మాంసపుముద్దలపై
విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటాయి''[3]

మగవాడు చూపులనే సూదులతో ఆడదాని శరీరాన్ని ఎలా హింసిస్తాడో, ఆ చూపులు స్త్రీలకి ఎంత జుగుప్స కల్గిస్తాయో, ఆ చూపుల్లో ఎలాటి సంకేతం ఉంటుందో పదునైన భాషలో చెప్పారు. ఎవరిని ఉద్దేశించి వ్రాశారో వారికి గుచ్చుకునేట్లుగా వుంది యీ కవిత. ఆ చూపులు ప్రతిచోటా ప్రతిక్షణం ఎలా వెంటాడుతాయో, ఎంత గాయపరుస్తాయో కళ్లకు కట్టినట్లు వర్ణించారు.

''రోడ్డు మీద
బస్సులోను, క్లాసులోనూ
వేసేప్రతి అడుగు వెనకా
శరీరంలోని ఏదో ఒక భాగాన్ని
గాయం చేస్తూ
విషపు చూపులు గుచ్చుకుంటూనే ఉంటాయి.''

నిజమేమరి! అయితే వీటికి పరిష్కారం పలాయనం కాదు. 'విషపు చూపుల నెదుర్కొనే ముళ్ళలాంటి తీక్షణత తో 'కళ్లతోనే యుద్ధం' చేయాలంటారు.

''కళ్లకేకాదు
ఈ దేశంలోని ఆడదానికి
వళ్లంతా ముళ్లుండే రోజు''[4]

రావాలంటారు. కామోద్రేకమైన చూపులతో స్త్రీలను హింసించే పురుషుల మీద తిరుగుబాటు చేయవలసిందిగా స్త్రీలోకాన్ని సంఘటితం చేయడం ఈ కవితలో కనబడుతుంది.

## 2. స్త్రీల అణచివేత :

పుట్టినప్పటినుండి ప్రతి దశలోనూ మగవాడు ఆడదాన్ని అణచి వేస్తున్న విధానంపై కలిగిన తీవ్రమైన ఆవేదన రూపం 'వామనుడి మూడోపాదం' కవిత. మదురై జిల్లాలో కల్లార్ కులస్థులు ఆడపిల్లలను పుట్టగానే చంపి వేసే దుర్ఘటనలు, ఆ హత్యల మూలంగా సంవత్సరానికి 6000 మంది పసికందులైన ఆడపిల్లలు పురిటిలోనే అతి భయంకరమైన చావుకి గురి కావడం చూసి స్పందించి వ్రాసిన కవిత 'వామనుడి మూడో పాదం'.

''అది
అక్కడెక్కడో జరిగిన
ఒక సంఘటన కాదు
వధ్యశిలలాంటి వ్యవస్థలో
గొంతుకలు తెగిన
ఆడజాతి కొట్టుకుంటోంది
.........................
అది
అక్కడ మాత్రమే జరుగుతున్నది కాదు
విశ్వవ్యాప్తంగా
గర్భంలో పెరిగే శిశు దశనుంచీ
ఆడతనంపై హత్యాచారం.''.

పుట్టుకనుండే స్త్రీ జాతిపై చూపుతున్న పురుషస్వామ్యపు అహంకారానికి పరాకాష్ఠయిది.

''పెరుగుతున్న ప్రతి దశలో
మగతనం అనే క్రూరమృగం
కాటు వేస్తోంది.''[5]

అని స్త్రీ జాతి దుస్థితి చూసి ఆక్రోశిస్తున్నారు. అయితే ఇది ఇలాగే కొనసాగదనీ , ఎప్పటికైనా మహిళా జాతి తిరుగుబాటు చేసి పురుష జాతి అహంకారాన్ని అణిచివేస్తుందనీ సవాల్‌చేస్తున్నారు.

స్త్రీల వస్త్రధారణలో కూడా ఫ్యూడల్ వ్యవస్థ ప్రభావం ఉండనీ, 'పైట' అనేది స్త్రీల స్వేచ్ఛను అణచివేస్తుందనీ, చిన్నతనంనుండే ఒదిగి వుండే బానిస మనస్తత్వాన్ని నేర్పుతుందనీ స్త్రీవాదులంటారు. ఆటవిక సంస్కృతి, సంప్రదాయాలు, పురుషస్వామ్యం - ఇవి స్త్రీల హీనస్థితికి కారణం అంటారు జయప్రభ, 'పైటని తగలెయ్యాలి' అనే కవితలో 'పైట కొంగును చూస్తే పాతివ్రత్యం గుర్తొస్తుంది' అనీ, పైట అనేది స్త్రీ స్వేచ్ఛని హరిస్తుందనీ, ఆడదానివని గుర్తు చేస్తూ, మనిషన్న భావాన్ని మరిపిస్తుందనీ అంటారు.

''నువ్వు ఆడదానివంటూ
హిప్నటైజ్ చేస్తుంది
నేనూ మనిషినన్న భావాన్ని
నా చేత మరిపిస్తుంది
.....................
నన్ను అబలని చేసిన
పితృస్వామ్యపు అదృశ్యహస్తంపైట''[6]

మొదటి నుండీ పాతివ్రత్యం, సంప్రదాయం పేరుతో సమాజం స్త్రీలను అణచివేసిందనీ, స్తీలు ఈ రెంటికీ ఎదురు తిరిగి స్వేచ్ఛను పొందాలనీ యీమె భావన. స్త్రీ పురుష వివక్షతలో వస్త్రధారణ కూడా ఎలా భాగమైందో తెలిపారు. వస్త్రధారణ అనే దానిలో స్వేచ్ఛ వుండాలని, అంటే ఏ రకంగా వేషధారణ చేసుకుంటే తమకు నప్పుతుందో ఆ రకంగా చేసుకొనే స్వేచ్ఛ, స్వయం నిర్ణయం స్త్రీలకు ఉండాలని అంటారు.

## 3. స్త్రీల ఆత్మగౌరవం :

'ఆడతనంతో! అచంచల విశ్వాసంతో!' అన్న కవితలో, స్త్రీగా పుట్టినందుకు కించపడాల్సిన పనిలేదనీ, ఆడవారు కూడా ఆత్మ విశ్వాసంతో ఎదగాలనీ, తమ పుట్టుక,

పెరుగుదల, మార్పులు వేటిలోనూ అవహేళనకు గురి అయ్యేది లేదనీ, స్త్రీ అయినందుకు గర్వంతో తలెత్తుకు తిరగాలనీ అన్నారు.

''ఈ ప్రపంచంలో
నా ఉనికి ఎంత నిజమో
నా కోరికలూ, ఆశలూ, ఆవేశాలూ
అంతే నిజం
......................
అవును!
నేను ఆడదాన్నైనందుకే గర్వపడతాను
......................
నా ఆడతనమే
నాకీ రూపాన్నిచ్చింది
నన్ను తల్లిని చేసింది
గర్వంతో తలెత్తుకునేలాలా చేసింది.''[7]

ప్రకృతి సహజమైన మార్పులకు కించపడనక్కరలేదనీ, ఆడదానిగా పుట్టినందుకు ఆత్మగౌరవంతో మెలగాలనీ అన్నారు.

## 4. సంప్రదాయ నిరసన :

సంప్రదాయం పేరుతో ఆడపిల్లల్లో స్వేచ్ఛని అణగద్రొక్కి వారి ఆలోచనలను అధఃపాతాళానికి త్రొక్కిన సమాజ వైఖరిని నిందిస్తున్నారు, 'అమ్మానీ గొంతు కలుపు' అన్న కవితలో జయప్రభ.

''అమ్మా నన్నెందుకు పెంచలేదు?
నిప్పులు తొక్కుతున్నా
రెప్పల తడి రానివ్వని నిబ్బరంతో
అమ్మా ! నన్నెందుకు పెంచలేదు?
ఏ పని మొదలెట్టబోయినా
ఇది నీకెందుకే తల్లీ అని వారించి
నీ కొంగు తప్ప వేరే ప్రపంచాన్ని
అమ్మా! నా కెందుకు చూపలేదు?''

ఆడపిల్లల్లో పుట్టుక నుండే, ఆధారపడే బానిస విధానాన్ని పెంపొందించిన సమాజాన్ని విమర్శించారు.

''మీ అమ్మని వాళ్లమ్మా
వాళ్లమ్మని వాళ్లమ్మా
ఇలాగే పెంచితే
నీకు మాత్రం ఎలా తెల్సుందిలే
గడప దాటని జైలునించి
ఆకాశం ఎలా కనిపిస్తుందిలే''

స్వేచ్ఛను అర్థం తెలియని ముందు తరాలవారి పెంపకం స్త్రీలలో చైతన్యాన్ని చంపివేసిందనీ, బాధ్యతలను నేర్పలేదనీ ఆవేదన చెందుతూ, కనీసం ముందు తరాల వారైనా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో మెలగాలని, అలాటిదానికి ప్రయత్నం చేస్తూ ప్రతిజ్ఞ చేస్తునారు.

''ఆలోచన చంపేసి అవిటివాళ్లని చేసేసిన
శతాబ్దాల మోసాలని తెలియజేసి తీరాలని
నీలా కాకుండా.... నాలా కాకుండా....
నా కూతురు దాని కూతురికి
ప్రపంచాన్ని పిడికిట పట్టుకోగల నమ్మకాన్ని
పుట్టుకతోనే కలిగించాలని
ఇది నా ప్రతిజ్ఞ! ఇది నా ప్రతిజ్ఞ!''[8]

## 5. భ్రూణ హత్యలు :

గర్భస్థపిండం ఆడ, మగ అనేది తెలుసుకోడానికి ఈ మధ్య ఒక పరీక్ష జరుపుతున్నారు. దాన్ని 'ఎమినియోసెంటిసిస్' (Aminiocentesis) అంటారు. గర్భధారణ అయిన రెండు నెలలకే గర్భస్థపిండం లింగ నిర్దేశన చెయ్యొచ్చన్నమాట.

ఒక బహిరంగ సభలో మాజీ మంత్రివర్యులు శ్రీ వసంతసాఠే ఇలా అన్నారు: ''బర్త్ కంట్రోల్ హక్కు ఉన్నప్పుడు యీ హక్కు కలిగి ఉండటంలో తప్పేమిటి? ఆడవారు పుట్టి ఏం సుఖపడుతున్నారు? కాబట్టి పుట్టకుండా అయినా చెయ్యాలి, లేదా పుట్టాక బాధలైనా సహించాలి. అసలు పుట్టని వాళ్లగురించి ఆలోచించేకండే పుట్టిన వాళ్లగురించి ఆలోచించడం శ్రేయస్కరం''. మంత్రి వర్యుల మాటలపై స్త్రీ జాతిలో

ఆందోళన సాగింది. మహిళాలోకం ఆవేశపడ్డది. 'రేపటి మీ పిల్లల ప్రాణాలకి' అనే కవితలో జయప్రభ శ్రీవసంతసాథే మాటలపై నిరసన వెలిబుచ్చారు. కవితలో తమ ఆవేదనను, ఆక్రోశాన్ని యిలా వెలిబుచ్చారు:

''అందరూ ఒక్కసారి వినండి
వరకట్నానికి శాశ్వత పరిష్కారాన్ని
వసంత్ సాథే విశదం చేశారు
తల్లుల్లారా!
పెళ్లవగానే మగపిల్లల్ని మాత్రమే కంటామని
పవిత్రగ్రంథాల మీద ప్రమాణం చేయండి
.................................
శాస్త్రీయ పద్ధతులొచ్చాయి
పుట్టక ముందే ఆడపిల్ల పులివాత పడిపోయింది''

శాస్త్రీయ విజ్ఞానం ఎంత అభివృద్ధి చెందినా, దాన్ని సక్రమ మార్గానికి, సృజనాత్మకమైన పనులకి వినియోగించాలే కాని, వినాశానికి, అల్లకల్లోలానికి ఉపయోగించకూడదు. పుట్టిన బిడ్డకానీ, పుట్టబోయే బిడ్డకానీ, ఆడపిల్ల అయితే చంపమనడం అమానుషం! అసలు సంతానం అక్కరలేదన్నా, పుట్టకుండా నిరోధించుకున్నా ఫరవాలేదు. కాని ఆడ సంతానాన్ని మాత్రమే నశింపు చేసుకోవాలనడం ఘోరం! పైశాచికం!
ఆడ, మగ వ్యత్యాసాలకీ, స్త్రీల అణచివేతకీ, ఇది పరాకాష్ఠ!

''తలని వాడి పాదాలముందూ
తనువు వాడి గుప్పెట్లోను పెట్టినందుకు
వాడు ఆడమన్నట్టలా ఆడినందుకు
నిన్ను పుట్టనే వద్దంటున్నాడు.''[9]

## 6. ఆడపిల్లల పెంపకం:

సంప్రదాయాల, ఆచారాల సంకెళ్లతో, స్త్రీని ఒక వ్యక్తిగా పెరగనివ్వక, ఆమె భావాలకు, ఆలోచనలకు అడ్డుకట్ట వేశారు. ఆమె పెంపకంలో కూడా వ్యత్యాసాలే, 'ఆదే విషయం' అన్న కవితలో, ఆడపిల్లను చిన్నతనంలో అమ్మాయిగా వుండనివ్వక, లేని పెద్దరికాన్ని నెత్తినరుద్ది, ఆమె స్వేచ్ఛని హరింపజెయ్యడం, పెద్దయ్యాక ఆడదానిగా గుర్తించక, ఆమె వ్యక్తిత్వానికి విలువ నివ్వకపోవడం అనే విషయాలను గుర్తిస్తూ జయప్రభ యిలా వ్రాశారు:

''నేను
చాల చిన్నగా ఉన్నప్పుడు
అమ్మాయినవటమే ఒక పెద్ద విషయమని
నాకు తెలీనేలేదు
కొంచెం పెద్దయ్యాక
పదకొండేళ్లకే తెలిసిపోయింది
అదే ఒక పేద్ద విషయమని
.........................
నేనింకా అప్పటికి చిన్న పిల్లనే
..........................
అయినా
నాలో నాకే ఆంక్షలు మొదలు
............................
పదిహేడేళ్లొచ్చాక
నా అభిప్రాయాలని కూడా చెప్పాలను కున్నాను
కానీ
వాళ్లన్నారు కదా
నువ్వింకా చిన్న పిల్లవే అని''[10]

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో, ఆటపాటలతో గడిపే బాల్యదశలో 'పెద్దయ్యా' వనే పేరుతో ఆంక్షలు విధించారు. ఒక వయస్సు వచ్చి సొంత వ్యక్తిత్వం ఏర్పరుచుకునే సమయంలో ఆమె అభిప్రాయాలకు విలువ నివ్వక, ఆత్మగౌరవం గల వ్యక్తిగా గుర్తించక 'నువ్వింకా చిన్నపిల్ల' వని అన్నారు. 'అప్పుడు అమ్మాయిగానూ ఉండనివ్వలేదు, ఇప్పుడు ఆడదానిగా గుర్తించనూలేదు' అని వాపోతున్నారు కవయిత్రి.

స్త్రీవాద కవిత్వతంతో స్త్రీలను చైతన్యవంతులుగా చేసే ప్రయత్నంలో, నేటి సమాజంలో స్త్రీ ఎదుర్కొంటున్న సమస్యలను ప్రస్తావించారు శ్రీమతి జయప్రభ. విజ్ఞాన శాస్త్ర ప్రభావంతో గర్భస్థ శిశువు లింగనిర్దేశన పరీక్షలు నేడు జరుగుతున్నాయి. అది అన్యాయమని ఘోషిస్తున్నారు శ్రీమతి జయప్రభ. సమాజంలో స్త్రీ బయటికి వస్తే ఆకలిగొన్న మగవారి 'చూపులకు' ఎలా చిత్రహింసకు గురి అవుతున్నదో తమ కవితలలో తెలియపరిచారు. సంప్రదాయాలు, ఆచారాలు స్త్రీని ఎలా అణిచి వేశాయో,

ఆమె వ్యక్తిత్వాన్ని ఎలా అణగద్రొక్కాయో తమ కవితల్లో తెలియజేశారు. శక్తివంతమైన పదాలతో సూటిగా హృదయానికి తాకేట్లు, ఎవరినుద్దేశించి వ్రాశారో వారికి తగిలేట్లు వుంటాయి యీామె కవితలు. ఈమె స్త్రీ వాదంలో లైంగిక స్వేచ్ఛ ముఖ్యమైనదిగా భావించారు. ఆడవాళ్లకు తమ శరీరం మీద ఆధిపత్యం తమకే వుండాలని, పాతివ్రత్యం, నీతి ఆడవాళ్లకి సంకెళ్లవంటివని జయప్రభ గారి అభిప్రాయం.

(1990 లో బెంగుళూరు విశ్వవిద్యాలయం నుండి ఎం. ఫిల్. డిగ్రీ పొందిన శ్రీమతి కమలాకర రాజేశ్వరిగారి ' ఇటీవలి తెలుగు కవిత్వంలో స్త్రీ వాదం' (1987-90) అనే లఘు సిద్ధాంత వ్యాసం నుండి గ్రహింపబడిన ఒక ప్రకరణం - సంపాదకులు)

సూచికలు :

1 జయప్రభ. 'సంపాదకీయం'. **లోహిత**, అక్టోబర్ 1989.
2 జయప్రభ. 1987. **వామనుడి మూడోపాదం,** హైదరాబాదు : చైతన్య - తేజ పబ్లికేషన్స్, పుటలు 3,4.
3 అదే. పుట 3
4 అదే. పుట 4
5 అదే. పుట 7
6 అదే. పుట 38
7 అదే. పుట 56
8 జయప్రభ. **లోహిత**, సెప్టెంబరు 1989, పుటలు 6,7.
9 జయప్రభ. **లోహిత**, అగస్టు 1989, పుటలు 5,6.
10 జయప్రభ. **లోహిత**, అక్టోబరు 1989, పుట 10.

---

'' ఈ స్త్రీ పురుష సంబంధంలోంచి సుఖం రావాలంటే, వికాసం కలగాలంటే, దేశపు పరిస్థితి పూర్తిగా మారాలి. వంటా, చాకిరి, పిల్లల్ని కనడం, పెంచడం - ఇంతకన్న చాలా సులభమూ, సుఖమూ కావాలి స్త్రీకి''

– చలం

'కవయిత్రీ తిలక'

# శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి

## జీవనరేఖలు

1 జననం : 1-5-1943

2 స్వగ్రామం : గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, గోవాడ గ్రామం

3 తల్లిదండ్రులు : కీ. శే. ఇంటూరి మరియమ్మ (యలవర్తి) - కీ. శే. నడకుర్తి వెంకటరత్న కవి- (వీరు గొప్ప కవి. పద్యకావ్యాలు నాటకాలు ఎన్నో రచించారు)

4 విద్యాభ్యాసం : సెకండరీ విద్య, ఉపాధ్యాయిని శిక్షణ

5 ఉద్యోగం : ఉపాధ్యాయిని

6 భర్త : శ్రీ కొలకలూరి బన్యాస్, ఉపాధ్యాయుడు

7 సంతానం : కూతురు : శ్రీమతి దేవికారాణి
కొడుకు : విద్యాధర చక్రవర్తి

8 రచనలు : ముద్రితాలు : 1) గంగావతరణ - శివతాండవము
2) చంద్రగ్రహణము
3) ప్రబోధము
4) నన్నయ మహిళ
5) కల్యాణ వాణి మొదలగునవి.
అముద్రితాలు : 'సాహిత్య సౌరభము' (సారస్వత వ్యాస సంపుటి)

9 విలాసం : 35-3-80/1, విద్యాసదనం, కేశవస్వామిపేట, ఒంగోలు 523 001


యువవసంతం - వర్షం

# స్వరూపరాణి కవితా వాణి

-యం. వి. యన్. యల్. ప్రసాద్

''పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెల్లన్
ముగురాడు వార మైతిమి
వగ పేటికి జలకమాడ వచ్చినచోటన్'' (చానమ్మ)

అంటూ ఉద్విగ్నమైన, ఉద్రేకపూరితమైన మనస్సుతో, ఆత్మాభిమానంతో జాతీయతా ముద్రతో ప్రారంభమైన మహిళా సాహిత్య ప్రభంజనం, వర్తమానంలో శతాధికమై, పురుషాధిక్యతను ప్రతిఘటిస్తూ, ఉద్యమిస్తూ, నవచైతన్యాన్ని ఆవిష్కరించి సమకాలీన ఆర్థిక, సామాజిక, రాజకీయ సమస్యలతో తాదాత్మ్యం చెంది, సద్యఃస్ఫురణంగా ప్రతిస్పందిస్తూ, మరోవైపు యుగ యుగాలుగా, తరతరాలుగా భావదాస్యాన్ని, మానసిక శారీరక బానిసత్వాన్ని బాధ్యతల బంధనాల మధ్య మోస్తూ, ఆచారాల, సంప్రదాయాల అరాచకత్వానికి బలౌతూ, రాక్షస వాంఛలకు అత్యాచారాలకు గురౌతూ, షడ్గుణ్యాయుక్తలై, అహల్యలై, మౌనంతో సమాధి చేయబడుతున్న స్త్రీ ఆక్రందనలను ఆలకించి, హృదయపు లోతులను పరిశీలించి, సుప్త చేతనలోని వాస్తవిక వ్యక్తిత్వాన్ని, కాంక్షలను, కార్పణ్యాలను వెలికి తీసి, విశ్లేషించి, అంతరంగ బహిరంగ సమస్యలను విలక్షణమైన భావవైవిధ్యంతో, అనుభూతితో కావ్య స్పర్శ గల స్పష్టమైన గంభీరమైన అభివ్యక్తితో కవిత్వీకరిచటం అభినందనీయమైన పరిణామం.

కవిత్వానికి ఆత్మాశ్రయ, పరాశ్రమ సమస్యలే ప్రధానేతి వృత్తాలైనప్పటికీ, ఒకతరం కవయిత్రులు, కవులు ఛందస్సును అభివ్యక్తి మాధ్యమంగా స్వీకరిస్తే, ఆంగ్ల సాహిత్య ప్రభావం వలన, మారుతున్న సాహిత్య విలువల కారణంగా, ఈ నాటి కవులు కవయిత్రులు వచనాన్ని అభివ్యక్తి మార్గంగా అంగీకరించారు. లోకోభిన్నరుచిః. కానీ ప్రాచీన సంప్రదాయ పద్ధతులలో కట్టుదిట్టంగా పద్యం వ్రాయగల శిష్టులు, వచన కవులను కుకవులని, అవ్యుత్పన్నులని నిరసించటం; పద్యం బూర్జువా ఫ్యూడల్ వ్యవస్థ యొక్క కళావశేషంగా వచన కవులు భావించి తిరస్కరించటం ఘర్షణలకు, వైమనస్యాలకు కారణమయింది.

ఈ నేపథ్యంలో ప్రాచీన సంప్రదాయ రీతిలో, చక్కని పద బంధంతో, జాతీయాలు, సామెతలు ఆమెతలుగా పెడుతూ, మందమందాకినీ గమన సదృశమైన పద్య రచనను ఒడుపుగా చేస్తూ ; వచన కవిత్వధర్మాలను, ఇజాల నిజాలను, ప్రయోజనాలను ఆకళింపు చేసుకుని సామాజిక స్పృహతో వచన కవితలను నేర్పుగా వ్రాయగలగిన ధీశాలి, ప్రతిభావ్యుత్పన్నురాలు శ్రీమతి కొలకలూరి స్వరూపరాణిగారు.

సూక్ష్మంగా పరిశీలించినట్లయితే వచన రచనకు పద్య రచనకు గల ప్రణాళికలోని అంతరం వాటి మధ్య వైరుధ్యానికి కారణమా అన్నంత స్పష్టంగా కనిపిస్తుంది. పద్యకవితలో వర్ణనా ప్రియత్వం, అతివిస్తార భావచాలనం అతివేలంగా కనిపిస్తే, ప్రోడ్డీన భావోద్వేగాన్ని అత్యంత సంయమనంతో సూక్ష్మీకరించి సంక్షిప్తం చేసి, నిశితత్వాన్ని, శక్తిని సమకూర్చటం వచన కవిత్వ రచనా ప్రణాళికగా మనకు కనిపిస్తుంది. పరస్పర విరుద్ధమైన ఈ రెండు లక్షణాలను ఆత్మీకరించుకొని, పద్య కవిత్వానికి, వచన కవిత్వానికి సమ దృష్టితో న్యాయం చేకూర్చగలిగిన, గలుగుతున్న కవయిత్రి శ్రీమతి స్వరూపరాణిగారు.

**జననం:**

శ్రీమతి స్వరూపరాణి గారు గుంటూరు జిల్లా తెనాలి తాలుకా గోవాడ గ్రామంలో 01-05-1943న శ్రీ నడకుర్తి వేంకటరత్న కవి, రత్న మరియాంబల ప్రథమ పుత్రికగా జన్మించారు.

**తల్లిదండ్రులు:**

పిల్లల భవిష్యత్తుకు, అభివృద్ధికి కుటుంబ వాతావరణం ప్రథమ మార్గదర్శి అన్న సూక్తి శ్రీ స్వరూపరాణిగారిపట్ల అన్ని విధాల నిజమైంది. శ్రీ రత్న కవిగారు చేసినది క్లర్కు ఉద్యోగమైనా, ప్రవృత్తి కావ్య రచన. వీరు అర్ధశతాధిక గ్రంథాలు రచించారు. అలతి అలతి పదాలతో, అచ్చ తెలుగు పదాల పోహళింపుతో, సాహిత్య లక్షణ సుగంధాలతో వీరి కవిత్వం పరిమళిస్తూ పాఠకుల హృదయాలను చూర గొంటుంది. హిందూ వేదాంత తాత్త్విక దృష్టి వీరి రచనలనిండా వ్యాపించివుంటుంది. వీరు రచించిన ''శివకేశవ యుద్ధం''లోని ఇతివృత్తం బ్రహ్మాండపురాణంలో సంక్షిప్తంగా ఉండగా, దానిని స్వకపోలకల్పనలతో సోపజ్ఞతతో విస్తరించి, నాటక మర్యాదలతో అత్యంతరమణీయంగా హృదయంగమంగా రచించారు. చక్కని ధారాశుద్ధి ఔచిత్యవంతమైన పద ప్రయోగ నిపుణత, రసోచిత నిర్మాణ దక్షత రత్న కవిగారికి స్వాభావిక లక్షణాలు. మాయావటువుగా వచ్చిన పరమశివుడు, పార్వతీదేవి చిత్తశుద్ధిని, లక్ష్యశుద్ధిని పరీక్షించటానికి వచ్చినప్పుడు, భవాని భవుని విభూతిని ఈ విధంగా వివరిస్తుంది:

ధనహీనుడై సమస్త జ్ఞాన ధనమును
సకల లోకులకు నొసంగువాడు;
బూదిబూసికొనుచు భువనంబులకు నెల్ల
సర్వ విభూతి నొసంగువాడు;
ఒలికి మిత్రులలోన నుండియు నిఖిల
జగంబుల జరియింప గలుగువాడు;
కన్నవారెవరు లేకున్న నెల్లరకు దా
తల్లియుదండ్రియై తనరువాడు;
రంజనా రహితుండు మృత్యుంజయుండు
నిర్వికారుండు, దారుండు, నిర్గుణుండు
సచ్చిదానందు డభవుండు శంకరుండు
మన్మన స్వామి మన్మనో మందిరుండు.

భాషా భేషజంలేని సరళమైన, సురుచిరమైన భాష వీరిది అనటానికి స్థాలీపులాక న్యాయంతో ఒక్క ఉదాహరణ చాలు. శ్రీ రత్న కవిగారి నిరంతర పఠనాసక్తి కవితా వ్యాసంగం వారి సంతానాన్ని ప్రభావితం చేసింది. శ్రీమతి స్వరూపరాణిగారి తల్లి రత్నమరియాంబ చక్కని గాయని. సంప్రదాయ సంగీతంలో కూడ వీరికి ప్రవేశం వుంది. బహుముఖ ప్రజ్ఞాశాలులైన తల్లిదండ్రుల నోముల పంట స్వరూపరాణిగారు.

**విద్యాభ్యాసం:**

శ్రీమతి స్వరూపరాణిగారి ప్రాథమిక విద్య ఉపాధ్యాయిని అయిన తల్లి ఒడిలోనే ప్రారంభమైంది. తండ్రి సాహచర్యంలో, ఆయన పంచిన అనురాగంలో పూతై, మొగ్గై, పూవై పండై బహుముఖాలుగా వ్యాపించి, అభివృద్ధి చెందింది. వీరు గుంటూరులోని బండ్లమూడి హనుమాయమ్మ హిందూ హైస్కూల్ లో S. S. L.C. చదివారు. అనంతరం కవితాభిమానంతో శ్రీ శారదా నికేతనంలో భాషాప్రవీణ చదవటం ప్రారంభించి, మధ్యలో ఆపివేసి ఉపాధ్యాయ శిక్షణను పొందారు.

**వృత్తి:**

సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయ శిక్షణను పొందిన వీరు అనంతపురం జిల్లా మోడి గ్రామంలో తమ ఉపాధ్యాయ జీవితం ప్రారంభించారు. వీరు ప్రస్తుతం ప్రకాశం జిల్లా టంగుటూరు మండలం ''యరజర్ల'' గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయినిగా పని చేస్తున్నారు.

రచనా వ్యాసంగం:

చిన్నతనం నుండి ఇంటిలోని వాతావరణం కావ్యాలతో, కావ్యపఠనంతో, కావ్యరచనా వ్యాసంగంతో కళకళలాడుతూ వుండటం వలననూ, తన తండ్రిగారి రచనలకు లేఖకురాలిగా పని చేయటం వలననూ, స్వరూపరాణిగారికి కావ్య పఠనంపట్ల, రచనపట్ల అభిరుచి వయస్సుతో పాటు అభివృద్ధి చెందుతూవచ్చింది. తండ్రినుండి లభించిన స్ఫూర్తితో స్వరూపరాణిగారు S. S. L. C చదివేటప్పుడు స్కౌట్‌గైడ్లపైన 'గైడుకానుక' అనే వచన కవిత రచించారు. అది ఆనాటి స్కౌట్ పత్రికలోను ప్రచురింపబడింది. ఆనాడు ప్రారంభ రచనతో ఇనుమడించిన ఉత్సాహంతో రచనా వ్యాసంగం ప్రారంభించిన స్వరూపరాణిగారి లేఖిని వెనుకకు తిరగలేదు. పుంఖాను పుంఖాలుగా పద్య కవితలు, గేయ కవితలు, వ్యాసాలు వ్రాయటం ప్రారంభించారు. వీరి రచనలు 'కిరణం' అన్న క్రైస్తవ పత్రికలోను, ప్రసిద్ధి చెందిన కృష్ణా పత్రిక, భారతి, సృజన, హేతువాదం, ప్రజాసాహితి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ వంటి మాస- వార - దిన పత్రికలలోను ప్రచురింపబడ్డాయి. ఆల్ఇండియా రేడియో, కడప, విజయవాడలవారు ఏర్పాటుచేసిన అనేక కవి సమ్మేళనాల్లో వీరు తమ కవితలు వినిపించి మేధావుల ప్రశంసల నందుకున్నారు.

బిరుదులు - సన్మానాలు :

స్వరూపరాణి సాహిత్య కృషిని ప్రశంసిస్తూ 'హిందూపూర్ వరల్డ్ ఇవాంజలిజమ్ మిషనరీ సంస్థ' వారు వీరిని 'కవయిత్రీ తిలక' అనే బిరుదుతో సత్కరించారు. 1986లో హైదరాబాద్ రవీంద్రభారతిలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర అవతరణోత్సవ కార్యక్రమంలో పాల్గొని నాటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుగారిచే సన్మానం అందుకున్నారు. 'యువ సాహితీ వికాస వేదిక' ('నున్న' గ్రామం) వారు నిర్వహించిన కవితల పోటీలలో పలు సార్లు బహుమతులందుకున్నారు.

రచనలు:

శ్రీమతి స్వరూపరాణిగారు ''గంగావతరణ శివతాండవం'' అనే ద్విపద కావ్యం, ''చంద్ర గ్రహణం'' అనే ఆధునికేతి వృత్తం గల పద్య ప్రబంధం, ''ప్రబోధం'' అనే ప్రబోధాత్మకగేయ సంపుటిని, ''నన్నయ మహిళ'' అనే పరిశోధనా వ్యాసాన్ని రచించారు.

గంగావతరణం:

ఇది ద్విపద కావ్యం. ఇందులో వంద ద్విపదలున్నాయి. రచన దీర్ఘ దీర్ఘ సమాస భూయిష్ఠమై అక్కడక్కడ నిఘంటు ఆపేక్షగలిగిన పదప్రయోగాలతో సుదీర్ఘ వర్ణనలతో ప్రౌఢంగాసాగింది.

కావ్యారంభంలో-

సాంద్ర వైరాగ్య సాంసారిక సౌఖ్య
రుద్ర భద్రాద్వైత రూపమనగ -

అని పరమశివుని అద్వైత రూపాన్ని ప్రశంసిస్తూ,

నటరాజు సలుప ననాది తాండవము
నిటల నేత్రోష్ణ దృగ్నిచయ దీపికల
పృథువాభ్ర తలము దీప్తిమయంబు గాగ
ప్రథిత కేళీచలత్పుటు తర ద్విపద.
సలిలిత కింకిణీ ఝుళ ఝుళ ఝూళ
కలరవంబులు పద కల్పిత ద్విపద
రమణీయ కవన నర్తకిని మేల్కొలుపు

సమధికోత్సాహ వశంవదో దగ్ర - చిత్త వృతితో కావ్య రచనా భూమిక లభించి కావ్య స్థితిని పొందిందని పేర్కొన్నారు. వీరి ప్రౌఢ రచనకుదాహరణ:

లఘువర్షక కణోల్లస శరత్ శుక్ల
గగనఖండంబున - కామితలోక
కల్యాణ మధు సుధాకర ప్రౌఢ నృత్య
లౌల్య శ్రమా పరిప్లవ ఘర్మ బిందు
ధారాపరీతమ్మై తనువు రహింప-

నటరాజు నాట్యమాడాడట.

ఇద్దరు జలక్రీడ నేపుమీరంగ
విహరించి, విహరించి, విరమించి దరిని,
రహిమించు రాజ మరాళంబు రీతి-

బిరుదుగల నడకతో వీరి ద్విపద రచన భావగాంభీర్యంతో, అర్థగౌరవంతో రాజ మరాళం వలె సాగింది.

**చంద్ర గ్రహణం:**

ఆధునిక సమస్యలను, ప్రాచీన కథాంశాలను, సాంకేతిక విద్యాభివృద్ధిని ఇతివృత్తంగా స్వీకరించి, నిర్వచనంగా రచింపబడిన పద్య కావ్యం. ఈ కావ్యంలో అనేక వినూత్నాంశాలు స్థానాన్ని సంపాదించుకున్నాయి. భారతీయ కవులకు చంద్రుడు, పురుషుడు. పాశ్చాత్య కవులు చంద్రుని స్త్రీగా స్వీకరించారు. ఈ కావ్యంలో కవయిత్రి చంద్రబింబమును స్త్రీగా గ్రహించడం విశేషం. సంప్రదాయ వ్యతిరేకం. ఇతివృత్తంలోనే వీరి వై చిత్రి, నిరంకుశత్వం

కనిపిస్తుంది. వీర విరసం కవులు కూడా సంప్రదాయానికి భిన్నంగా చంద్రుని స్త్రీగా స్వీకరించకపోటం గమనించదగిన విషయం.

రాహువు చంద్రబింబం భర్త. నక్షత్రములు వారి సంతానం. చంద్రబింబమునకు భూలోకం నుండి అతిథిగావచ్చాడు ఆర్యభట్టు. చంద్రబింబం ఆర్యభట్టుతో తన సాధక బాధకాలను వెళ్లబోసుకుటుంది. తన జన్మను గురించి కవులు పుక్కిటి కథలు కల్పించారని, గురుపత్నీ జారత్వం అంటగట్టారని, వీరభద్రునిచే తన్నించారని ఇవన్నీ అభూతకల్పనలని, అంటుంది. తాను భూలోకంలో జరుగుతున్న అన్యాయాలను, అత్యాచారాలను గమనిస్తున్నానని, మానవుని దుస్థితికి కారణమైన అనేక సమస్యలకు పరిష్కారం సూచిస్తుంది. చివరకు గ్రహణం బారి నుండి నన్ను రక్షించమని ఆర్యభట్టును అభ్యర్థిస్తుంది.

ఈ కావ్యంలో ప్రతి పాత్ర ఒక ప్రత్యేక వ్యక్తిత్వంతో ప్రతీకలుగా కనిపిస్తాయి. గ్రహణం- భార్య వ్యక్తిత్వాన్ని భంగ పరిచి, తన పురుషాధిక్యతను ప్రదర్శించే దుర్మార్గుడైన భర్త నియంతృత్వంగా గ్రహిస్తే, రాహువు మహిళాభ్యుదయాన్ని, వికాసాన్ని క్రూరాధికార దంష్ట్రలతో నిరోధించటానికి ప్రయత్నించే పురుషుడు. చంద్రుడు లేదా చంద్రబింబం పితృ స్వామ్య వ్యవస్థలో సామాజిక, ఆర్థిక సంబంధాల వధ్య, ఆచారాల, సంప్రదాయాల మధ్య ఉక్కిరిబిక్కిరవుతూ, బానిసత్వపు వధ్య శిలపై అనునిత్యం మరణించే మధ్య తరగతి మహిళకు ప్రతినిధి. అభ్యుదయానికి, ఆధునికతకు, ఛాందస సంప్రదాయాలపై ప్రకటించిన తిరుగుబాటుకు, మానవుని మనో వైజ్ఞానికాభివృద్ధికి ప్రతీక ఆర్యభట్టు. అందుకే చంద్రబింబం, రాహువుపై యుద్ధం ప్రకటించి గ్రహణ వ్యధనుండి తనను తప్పించమని అడగటం. ఈ విధమైన మార్మిక భావాలను నింపుకుని, అనుభూతిలో, అభివ్యక్తిలో వైవిధ్యాన్ని ప్రకటించిన కావ్యం చంద్రగ్రహణం. ప్రకృతి వర్ణనలు కూడా కవి సంప్రదాయ విరుద్ధంగా సాగటం గమనించదగినది.

మనవున కట్నమెల్ల తనమామ యొకే పరిక్రక్కడంచు, తా
ళి నవల వైచియున్, విడిచి లేజెలువన్ తరితోచి వాలునన్
జనువరుడోయనంగ మలి సంజె ముహూర్తములోన పద్మకాం
తను నడియేటిలో వదిలి తానరి గెన్ రవి పశ్చిమాశకున్. (పుట 51)

అని ఉత్ప్రేక్షించటం కవయిత్రి సామాజిక స్పృహకు అద్దం పడుతుంది.

**ప్రబోధం :**

అభ్యుదయ వస్తు ప్రియత్వంగల కవయిత్రి అభ్యుదయ మార్గంలో రచించిన సమాజ ప్రబోధం ఈ 'ప్రభోధం'- ఈ కవితా సంపుటలోని కవితలన్నీ మానవ

సమాజానికి నైతిక సందేశాన్ని అందజేసేవే. సామాజిక స్పృహ కవితలకు ఆత్మ సదృశంగా కనిపిస్తుంది.

'దీపాన్ని' అనే కవితతో ఈ సంకలనం ప్రారంభమవుతుంది.

''దీపాన్ని..... తరతరాల నిస్సహాయతకు.... తరగని నిస్వార్థతకు/స్వరూపాన్ని....'' అని సమాజ శ్రేయస్సులో భాగస్వాములవుతూ, కుల, మత, ఆర్థిక వ్యత్యాసాల కారణంగా అణచివేయబడుతున్న '' నిమ్న వర్గాల'' వారి దైన్యాన్ని వ్యక్తపరుస్తుంది.

'తత్త్వం' కవితలో ''మరణానికి యోగ్యతాపత్రం / కావాలి/ జీవితం'' అనే వాక్యం గొప్ప తాత్త్విక భావం. ప్రతి మానవుడు ''జీవన్మృతుడు'' కావాలని, భౌతికమైన శరీరం నశించినా, జీవిత స్మృతి సుగంధాలు కాలంతో పాటుగా శాశ్వతం కావాలంటే మనిషి మనిషిగా జీవించాలనే ఆకాంక్ష ద్యోతకమవుతుంది.

''హెచ్చరిక'' లో స్త్రీ వాద కవిత్వ ధోరణి కనిపిస్తుంది.

ఈ సంకలనంతో శక్తివంతమైన, గంభీరభావముద్ర గల కవితలు వున్నప్పటికీ, ''సమిధ'', ''దేవుడికి లేఖ'', ''కేబరేడ్యాన్సర్'' వంటి కవితలు కొన్ని శుష్క నినాద ప్రాయంగా, కవితాత్మలోపించి కనిపిస్తాయి.

**సంపెంగ మనస్సు :**

''సంపెంగ మనస్సు'' వ్యంగ్య ప్రధానమైన పద్య కావ్యం. అముద్రితం. స్వాధీన పతిక అయిన సంపెంగ నాయిక. పర స్త్రీ వ్యామోహితుడైన భ్రమరం నాయకుడు. సంపెంగను, భ్రమరాన్ని ఆలంబనంగా చేసికొని స్వరూపరాణిగారు సున్నితమైన హాస్య ధోరణిలో వ్యంగ్యంగా, స్త్రీ పురుష సంబంధాలను వ్యక్తపరిచింది. ఈ కావ్యంలో వీరి పద్య రచన పరిణతిని సాధించింది. భర్త ప్రేమానురాగాలను పొందుతూ ఆనందించే తన స్నేహితురాండ్రతో సంపెంగ ఈ విధంగా తన వ్యధను వినిపిస్తుంది.

''ఏమే మాలతి! యేమె పొన్న! విర జాజీ, మల్లె మందారమా
క్షేమం బేకద మీకు? మీ భ్రమర సంశ్లేషాసుఖ శ్రీలకున్
మీమోదాలకు నోచినమ్మలకికిన్ మీమోదమ్మా మోదమా
నామోదంబున పాపమేమిగలదో, నన్నొల్లడీ సంపెగన్''.

అని విలపిస్తుంది. ఇందులో 'మోదము' - ఆమోదము, సుగంధము అన్న శ్లేషతో ప్రయోగింపబడింది.

**అభిమాన కవులు:**

శ్రీమతి స్వరూపరాణి గారికి తమ నాన్నగారైన శ్రీ రత్న కవిగారి కవిత్వమంటే ఇష్టం. కవిత్రయం, పెద్దన, చేమకూర వెంకట కవి. కంకంటి పాపరాజు, మొల్ల మొదలైన ప్రాచీన కవులూ; శ్రీశ్రీ కుందుర్తి, తిలక్, చలం మొదలైన ఆధునిక కవులూ అభిమాన కవులు. ఫెమినిజం పేరుతో వస్తున్న స్త్రీవాద కవిత్వంలోని నీలిఛాయలకు వీరు వ్యతిరేకి. స్వేచ్ఛ అశ్లీలంకాకూడదు, వివేచన కలిగి వుండాలనే అభిప్రాయం వీరిది. మతంపట్ల, మతధర్మాలపట్ల వీరికిగల అభిప్రాయాలు హృదయ సంస్కారాన్ని, మత సామరస్యాన్ని ప్రతిబింబింపజేస్తాయి. మతం వైయక్తికం. కనుక మతంలో ఘర్షణకు అవకాశం వుండకూడదు. ఒక వేళ అటువంటి వైషమ్యాలకు తావిచ్చినట్లైతే ఆమతం సమ్మతంకాదు- అని అంటారు.

**ముగింపు:**

గేయ రచనతో కవిత్వ రచన ప్రారంభించి, పద్య కవిత్వోద్యమంలో భాగం పంచుకుంటూ, ధారాశుద్ధి, అర్థస్ఫూర్తి గల పద్యాలూ, స్పష్టత, సామాజిక స్పృహ, విలక్షణానుభూతి, అభివ్యక్తిగల కవితలూ వ్రాస్తున్న స్వరూపరాణిగారు ముమ్ముందు కూడా సార్వ జనీనమైన ఉత్తమ సాహిత్య సృజనకు కృషి చేస్తారని, సమాజాభివృద్ధికి బాటలు వేస్తారని ఆశిద్దాం.

---

'' అన్నిటికన్నా విద్యకన్నా ముఖ్యం స్త్రీ స్వతంత్ర ఆర్జన. మనుషుల్నిగానీ, దేశాల్నిగానీ, అణగద్రొక్కాలంటే ఆర్థిక అసహాయత్వం ముఖ్య సూత్రం. అందుచేతనే స్త్రీ ముఖ్యంగా బానిస అయింది.

-చలం

---

'' చలం ఒంటరి పోరాటానికి సాముహిక రూపమే స్త్రీ వాద ఉద్యమం.''

-కాత్యాయని

# జయప్రభ

## అంగుళీ మాలికలమైనా

చిక్కుపడి ముక్తపదగ్రస్తమై
భాష బందీ అయిపోయింది
పిడుగుపడి మహావాక్యాలన్నీ ముక్కలై పోనూ...
ఏం పరాధీనత ఇదీ??

నాగలితో భూమి పొరలని పెళ్ళగించి నట్లో
గొడ్డలితో చెట్ల మొదళ్ళని తెగనరికినట్లో
ముక్కముక్కలుగా పదాల మెడవిరిచి
భూస్థాపితం చేతునా!

ఎందుకింకా పారిపోక
అపస్వరాల రాపిడిలోనే ఒరుసుకుంటూ
పరుగులెడుతున్నాం?
దుర్మార్గపు భావాలెన్నో గరళంలా మింగుతూ
వాళ్ళ సాహిత్యపు దాలిగుంటలో ఈదుతున్నాం?

ఈ దశకంఠ రావణ భాషనించి
తోవ తప్పి పోయినా బాగుణ్ణు మనం!
ముంచెత్తిన కవితా ప్రళయంలో
నీచ ధ్వనుల రూపాలు చెరిపి
మునిగిపోయినా బాగుణ్ణు మనం!
అప్పటికైనా ఈ కొండచిలువ భాష
ఈ ఉరికొయ్య భాష
ఈ గుదిబండ భాష
మన మెడ విడుతుందా?

అమ్ముడవుతున్న బానిసల శరీరాన్ని
శూలంతో పొడుస్తూ
నగ్నంగా ప్రదర్శించటం కన్నా హీనం కదా
మనల్ని గుర్తించిన పదజాలం?
ఎవడో కూసిన ఎంగిలి మాటలలో
మనమెలా మాట్లాడగలం?
ఈ సారహీనంలోకి తెచ్చి
మన ప్రాణమైన కొత్త వర్ణాలనెలా నాటగలం??
ఆ మాట బాణుడిదీ
ఈ మాట జాన్సన్ దీ
అయిన ఉచ్ఛిష్టం మనకేలనే?
జగత్సర్వం శ్రీహర్షుడిదో శ్రీనాథుడిదో
కాశిదాసుదో షేక్స్పియర్దో గాని మనది కాదు!
మనకి భాషా ప్రపంచం లేదు!

అనాదిగా పదార్థాలలో
మన రూపాలు చెరిపిన వాళ్ళ
వేళ్ళు నరికిన అంగుళీమాలికలమైనా
ఫరవా లేదు!
మనం విద్యుద్దండం చేబూని
భాషని పుటం పెట్టాలి!
అప్పటికి గాని
అగ్నిజాతగా మెరిసి
నారీనర సమానమైన
బీజాక్షరం పునర్భవించదు!!

❋ ❋ ❋ ❋ ❋

# కొలకలూరి స్వరూపరాణి

## స్త్రీ పర్వం

తరుణులు పూజలందుకొను తావులలోన వయాళి గొట్టగా
సురలను ఈడ్చి తెచ్చెదరు సుమ్మజనాభమునన్ విచక్షణా
పరులు- లతాంగి సుంత సమభావము కోసము కొంగు బట్టినా
పరగారె వంగతోటకడ బావల వోలె మొగమ్ము చాటుగన్. 1

వెర్గి తోచు విలక్షణంబులగు వేల్ విజ్ఞాన భండారముల్
కరకున్ గంటము తాళపత్రములలో కాంతా జనోద్ధార ణై
క రతిన్ పిల్లల జేసె, మంగళమునే కల్పించు గంభీర ధ
ర్మ రహస్యంబుల కింక పుట్టపగిలెన్, మార్ మ్రోగె శిక్షాస్మృతుల్. 2

కదలిన నొక చిక్కు మెదలు టింకొక చిక్కు
అడుగు ముందుకు వేయు టసలు చిక్కు
మోమున చిరునవ్వు మొలిచిన బల్ చిక్కు
కనురెప్ప లెత్తిన కద్దు చిక్కు
ఇరుగు పొరుగు తోడ చొరవ యేదో చిక్కు
చుట్టాల జూచిన గట్టి చిక్కు
పల్లెత్తి పలికిన వల్లమాలిన చిక్కు
మోమోట మంతకు మునుపె చిక్కు
చిక్కులను బెట్టకుంటయే చెడ్డచిక్కు -
దొడ్డిదారుల జనకుంట దొడ్డ చిక్కు
ముదితగా జన్మమెత్తుట మొదటి చిక్కు -
తోచదెటుజేయుటో దీని తుక్కు తుక్కు. 3

కవియై, శాస్త్రవిదగ్ధుడై, విపుల సంస్కార క్రియా శీలుడై,
ధవుడై, కారణ జన్ముడై, విబుధుడై, దైవాంశ సంభూతుడై,

ప్రవచించెన్ ''పురుషుండు'' భర్త పద సేవాచర్యయే నిత్యమౌ
నవలా జాతి భవాబ్ధినౌక యని ధన్యం మన్యుడై యుద్ధతిన్. 4

పిడిచి పురాణ సూత్రములు పెట్టిన భిక్షగ కాపురాలలో
నొడయని కాళ్ళ వ్రేళ్ళ బడి యూడిగముం బొనరింపకున్నచో
పడతికి ముక్తి లేదనెడి భావము వేరులు దన్నె గాని యిం
పడరెడు స్నేహసౌరభము లర్పణ చేయవు ప్రేమ సూనముల్. 5

యౌవన ప్రాంగణంబున నుషః కళ జిల్కియు కేతుగ్రస్తుడై
పావకు డేగినంత శతపత్రము నుండి వినిర్గమించునే
యౌవత జాయమాన హృదయంగమ రాగ ప్రగాఢ తన్మయీ
భావ వికాస ఫుల్ల శతపత్ర తనూ నిబిరీస వాసనల్. 6

## జీవితం

సంఘర్షణ ప్రొద్దై పొడవక పోతే
సమస్తం బట్టీ పట్టిన పద్యం.
సమన్వయం వెన్నెలై విరియక పోతే
సకలం దీర్ఘ శోకగీతం.
సమన్వయమే కుదిరి నాక
సంఘర్షణకు తావుండదు.
వేకువ రేకులు వేసినాక
చీకటికి చేవుండదు,
జీవితం ఈ రెండిటికీ మధ్య
జేవురించిన సంధ్య!

❄ ❄ ❄ ❄ ❄

# నాయని కృష్ణకుమారి

## అంతరంగ రోదసి

పుట్టి బుద్ధెరిగినప్పటి నుండీ
కాల సముద్రపు టంచున చేరి
నిరీక్షణలో వేగడం
నేనభిమానించే గొప్ప ఆట!

అల వెనక అలగా
త్వరపడి అదేపనిగా
ఋతువుల పందెపు పరుగు
నన్నలరించే ఆత్మీయసరణి!

ఉరవడిగా వెనక్కి తిరిగే
తీర తాడిత తరంగ వేగం
నా వెనుక నేనే పరుగులు తీస్తున్న
అస్త వ్యస్తపు ఆరాటం!
నాకు నచ్చిన బ్రతుకు పోరాటం!

కాల తరంగం నిర్విరామంగా
ముందు ముందుకు దూసుకు
వస్తూనే ఉంటుంది.
తీరంగా మారిన నన్ను మోదిమోదీ
అలసిసొలసి
వెనక్కి వెనక్కి జారి పోతూనే ఉంటుంది.
తీరస్థ శిలా సదృశ
మనః పరికల్పిత మూర్తినైన
నా పాదాలకు తడిపి తడిపీ
గెలుపు చూడలేని కన్నీటి ఓడికగా

విసిగి వేసారు తూనే ఉంటుంది.
కరిగే యిసుక పొరలపైన
కాల రేఖపైన
నా దృఢతను పరీక్షించే
జలతరంగ నాదం
నారాగ హృదయాస్తిత్వ పరాకాష్ఠ!

కళ్ళెం కొరకుతూ
నురగలు కక్కుతూ
పంచకల్యాణి గుర్రమైన కాలం
ఉరకులు పరుగుల మీద
ఉద్ధృతంగా వస్తూనే ఉంటుంది.
నిలువెత్తు తరంగ శీకరాసించనంలో
నా తలపైన
కబరీ భరంపైన
కపోలంపైన
అది ప్రేమతో మూర్కొంటున్న ముద్రలు.

ఆరు రుచులనూ
అరచేతి వేపపువు పచ్చడిని చేసి
జీవితాన్ని నేను ప్రాశించే తీరుపైన
దానికి మక్కువ ఎక్కువ.

నన్ను లోగొనాలని
నామనసును నడిపించాలని
నా జీవన పథంలో
తన ముద్రను భద్రం చేయాలని
సంకల్పించిన కాలంపైన
నాకు గొప్ప యిష్టంతో కూడిన
అలితి నవ్వు!

కారాకులూ లేచిగుళ్ళూ
మిక్కిలి పూతా చిక్కని పిందెలూ
పరిపక్వ సుగంధిల ఫలపుష్పాలూ
తాలోత్తాలతరంగ పాళిగా
ముద్దకట్టి
ప్రకృతే కాలమై
ఏకత్వం భజించిన చోట
నేనెవరనే విచికిత్స
అంతరంగ రోదసిని నిండి!

అవునూ
ఇంతకూ ఎవరు నేను
కాల సముద్రానికి వెలిగా
ప్రకృతి గీచిన చెలియలి కట్టపైన
నా అస్తిత్వాన్ని కాపాడు కుంటున్న
నేనెవరు!

ఏదో ఒక క్షణాన
సముద్రం నేను కావాలని పట్టుపడుతుంది.
వేవేల తరంగ ఫణాలతో
కసిగాట్లు కరిచే కాలనాగై
నా మన శ్శరీరాలను
బలంగా చుట్టుముడుతుంది.

నా అస్తిత్వాన్ని వెక్కిరిస్తూ
అనస్తిత్వాన్ని కూడదీస్తూ
కాలసముద్రం తన
అగణిత బిందు సందోహంలో
మరొక బిందువుగా
నన్ను కలుపుకుంటుంది.

అప్పుడు
నేనుకు అది చెప్పే భాష్యంలో
రంగూ రుచీ వాసన లుండవు.
తల్లి గర్భం నుండి బయట పడిన వైనాలూ
వ్యక్తిత్వ పరిరక్షణ వైఖరులూ
అంకెకు రావు
ఒక్క ఆద్యంత రాహిత్యం తప్ప!

ఈ దృశ
హఠాదాక్రమణ సంరంభంలో
స్తంభించి పోయిన
నా చేతన
స్థవిర శిల!

అప్పుడీ కాలమే
వెక్కి వెక్కి పడుతూ
ఏడుస్తుంది!
నేను కనపడక
తీరస్థ శిలను మోది మోదీ
ప్రశమిత తరంగ ఘోషగా
నైష్ఫల్యంలో లయించి పోతుంది.
ఎందుకో తెలుసా?
స్వాభిమానంతో చెక్కుచెదరని
నేనంటేనే
దానికి ఎంతో ఇష్టం కనుక!

❁ ❁ ❁ ❁ ❁

# మందరపు హైమవతి

## గృహలక్ష్మల్ని పూజిస్తాం

ఆచారాల పేరిట
అరికాళ్ళకింద మంటల్ని ఎగదోసినప్పుడు
అంతులేని మూగవేదన ననుభవించింది మేమే!
సంప్రదాయాల పేరిట
బతికుండగానే చితుల కెక్కించినపుడు
శవగీతాలు పాడింది మేమే!
ఔను! స్త్రీలను దేవతలుగా భావిస్తారిక్కడ!

❊ ❊ ❊ ❊ ❊

కోటి కోటి కాంక్షాలహరులు వెల్లువైముంచెత్తగా
సూత్ను వైవాహిక జీవన మాధుర్యాన్ని
ఆస్వాదించి పరవసించాలనుకొంటున్నప్పుడు
కట్నాల కామధేనువును పెరట్లో కట్టెయ్యలేదని
కానుకల కల్పతరువును ముంగిట్లో నాటలేదని
కిరసనాయిలుతో అభిషేకంచేసో గేస్ లీక్‌చేసో
అగ్ని సాక్షిగా వివాహ మాడినవారే
అగ్ని ప్రమాదానికి గురిచేస్తుంటే
ఆర్తగీతాలు పాడే అభాగ్యులం మేమే!
ఔను! చిరంజీవి సౌభాగ్యవతులుగా
ఆడపిల్లల్ని ఆశీర్వదిస్తారిక్కడ!

❊ ❊ ❊ ❊ ❊

మాతృగర్భంలో ఉండగానే
సతీ సావిత్రులను సతీ సుమతులను
ఆదర్శ ప్రాయులను చేసి
పాతివ్రత్యం పేరిట
ముఖం లేని మనుషులుగా
మార్చబడింది మేమే!
అందాల పోటీల పేరిట
అంగాంగ ప్రదర్శనకు
బలి కాబడింది మేమే!
వాణిజ్య ప్రకటనల్లో
చలనచిత్ర సీమలో
సౌందర్య ప్రదర్శనావస్తువులుగా
ప్రదర్శింపబడేవి మా శరీరాలే!
ఔను! స్త్రీలను పవిత్ర మూర్తులుగా గౌరవిస్తారిక్కడ!

❁ ❁ ❁ ❁ ❁

పది నెలలు మోసి
రుధిరాన్నే క్షీరంగా మార్చి
పిల్లల్నే లోకంగా భావించి
పెంచి పెద్దచేసినా
అప్లికేషన్‌లో పూర్తి చేయవలసింది తండ్రి పేరే!
ఔను! స్త్రీలను మాతృమూర్తులుగా సంభావిస్తారిక్కడ!

❁ ❁ ❁ ❁ ❁

ఇంటి పేరు మాదికాదు ఇల్లు మాదికాదు
ఇంటిబయట పతిదేవుని నేమ్‌ప్లేట్
ఇంట్లో గేస్‌కార్డుపై, రేషన్ కార్డుపై అతని పేరే
వంటింటి సామ్రాజ్యానికి మాత్రం

ఏక ఛత్రాధిపత్యం మాదే!
ఐనా వంట మాత్రం శ్రీవారి అభిరుచులమేరకే!
ఇంటిపని తో తీరికలేక
బయటి ప్రపంచానికి గవాక్షాలు మూసుకుపోయి
విజ్ఞానం వెలుతురు సోకక
వినోదం సమీరం ప్రసరించక
పంజరంలో పక్షుల్లా
బందిఖానాలో మగ్గిపోయేది మేమే!
ఔను! స్త్రీలను గృహలక్ష్ములుగా పూజిస్తారిక్కడ!

---

మన రక్తం పీల్చేసి, మన ఆశల్నీ, కలల్నీ కాజేసి
కొద్ది కొద్దిగా జీవితాంతం పీక్కుతింటున్న
రాకాసి గద్ద ఈ వంటిల్లు.
వంటింటి సంస్కృతి, వంటింటి ముచ్చట్లు
వంటలక్కలమైన మనం,
మనం ఏమైనా మన అంతిమ కర్తవ్యం
'గరిట తిప్పటం' గా చేసిన ఈ వంటిళ్లను
ధ్వంసం చేద్దాం రండి!
......................
మళ్ళీ మన పాపలు ఈ వంటరి వంటిళ్లలోకి
అడుగిడబోతున్నారు.
మన పిల్లలకోసం
వంటరి వంటగదులు కూల్చేందుకు రండి!

– విమల, 'వంటిల్లు' కవిత నుండి

# పాటిబండ్ల రజని

## క్షీరసాగర మథనం

తల్లిపాలు-
ఒక అద్భుత- అమలిన- అమృతప్రవాహం
తల్లీ బిడ్డల అపూర్వ అనుభవప్రదీపం

అంతా సహజమే అయినచోట
అట్టహాసాలతో పనేముంది?
వాత్సల్యధారలు ఎగసేచోట
వారోత్సవాల అవసరమేముంది?
నెలల గుడ్డును గుడ్డ ఉయ్యాల కప్పజెప్పి
మోకాలి లోతు బురదలో నాటేసేందు కెళ్ళిన
కూలితల్లి పాలసలువుల, బిళ్ళవాపుల గురించీ-
ఆముదంరాసిన జిల్లేడాకుల వేడి కాపు గురించీ-
అంకెల్లో అమ్మప్రేమను లెక్కించేవాళ్ళు ఎరిగి కూడా-
ప్రగల్భాలు తప్ప ప్రత్యామ్నాయం చూపరేం?
మూడు బాధ్యతల్ని మరచిన మూణ్ణెల తరువాత
పెను అవసరాల కానలో ఉద్యోగం బెబ్బులికి చిక్కి-
లేగకు పాలిచ్చేందుకు గడువిమ్మని అడిగితే
'చేపొచ్చిందా' అనే క్రూరాధికార హేళన విన్నాక-
తనకు తానుగా డబ్బాపాల జోలపాడే
ఆతల్లి సెలవు పొడిగించలేని
ఆరునెల్లు తల్లిపాలనే అంతర్జాతీయనివేదిక
ఆమెకు అంతర్మథనం మిగిల్చేందుకే కదా?
శరీరం ఖలుధర్మ సాధనాల మాధ్యమం కాక,
పలువస్తుప్రచారాల మాధ్యమమైన చోట
జారకూడని కొలతల కోసం

మాతృత్వ మాధుర్యాన్ని జార్చుకుని-
మామంచి మమ్మీలుగా నటించి మెప్పించే
సంస్కృతిని ఉదాత్తీకరించే ఉత్తుత్తి ఉద్యమాలు కాకుంటే-
పేదతల్లిబిడ్డడి పేగు కొట్టి నిలవచేసే
'మానవ క్షీరనిధీ' మత్స్యన్యాయం మరెవరికోసం?
వారోత్సవాలు కేవలం వాగాడంబరాలైతే-
ఉద్యమాలు ఉన్నవాళ్ళ సాయంకోసమైతే
తల్లి పాల సంవత్సరం-
తాటిచెట్టు తల్లిదనం!

---

'' నామీద
తరాలనుంచి మోపిన
అపనింద పైట!

నన్ను అబలను చేసిన
పితృ స్వామ్యపు అదృశ్య హస్తం పైట!

దోపిడీ సంస్కృతి
నా వ్యక్తిత్వాన్ని శవంగా చేసి
దానిపైన కప్పిన తెల్ల దుప్పటీ పైట!

నేను నడిచే శవాన్ని కాకుండా ఉండాలంటే
ముందుగా పైటని తగలెయ్యాలి!''

-జయప్రభ

# ఆదూరి సత్యవతీదేవి

## చెరవేలుపు

నిజానికామె యౌవన ఝరి
ఒక సౌందర్య రత్నాకరి
నవ్వు వెన్నెల తునకలూ
పెదవి వంపుల మెరుపులూ
మొగ్గజాబిలి నిగ్గులూ
లాలి వూయలల ముంగురులూ
పారంపర్య బహుమతిగ అందుకొని
యుగయుగాల ప్రకృతి పచ్చదనాన్ని
తనలో నింపుకొని
అభినయ నాట్యవేదాల
వినయపు విద్యాభ్యాసం నెరపి
రసజగమై ఎదిగిన ఆమెపై
ఎన్నెన్నో చూపుల తూణీరాలు గుచ్చుతాయి.

మనసు పరవశించో
మాటల వెన్నలకు మురిసో
స్వాప్నిక జగత్తులోని జానపద లోకంకై
కళని కైమోడ్చి
ఆపొగడ్తల చేతుల్లో వుంచుతుంది
తెరమీద పొరపొరగా
అస్తిత్వాన్ని రాల్చుకుంటూ వుంటుంది.
విద్యుత్ జలపాతాలమీద వూగే
రంగుల వూయలలోకి అలవోకగా చేరుకుంటుంది.
ఒక మాయలేడి వేషధారణలో పడి
మళ్ళీ మళ్ళీ తీగల్లో గాలివాటంగా చిక్కుకుంటుంది.

సర్కస్ ఫీట్ల మధ్య మాష్టరి ఆజ్ఞానుసారం చరిస్తూ
రెండో వూయల నందుకోలేక
ఒక మాంసాకృతిగానే మిగిలిపోతుంది.

వాడు ప్రఖ్యాతుడే చతురుడే
అయినా ఆమె సురభిళ సోయగాల్ని కొలిచిచూచే
చూపులేక మనసు ఎదుగుదల చాలక
వివిధ దేశాలనించి ఏరి తెచ్చుకున్న
వెర్రి మానసిక వ్యాధుల బాధలతో కుళ్ళుతూ
సమస్త హీన దౌర్భాగ్య భావజాలాలతో
ఆమెని ముక్కలు ముక్కలుగా కత్తిరించి
రూపాయి బిళ్ళ కటూయిటూ అతికిస్తాడు.

జూదం తారస్థాయికి చేర్చి
క్రూర మృగాల్ని వుసిగొలిపి
నందన వనాల్ని నాశనం చేస్తాడు.
మనిషిముఖం తగిలించుకుని తిరిగే ఆ తోడేల్ని
ఇప్పుడిప్పుడే లేళ్ళు గుర్తుపడుతున్నాయి
గుట్టు బయట పెడుతున్నాయి.

---

'' ఈ నాటికీ దాంపత్య జీవితంలో స్త్రీ యాక్టివ్ పార్ట్ తీసుకొంటే పురుషుడు సహించలేడు. తెలిసిన విషయాన్ని తెలియనట్టూ, కావలిసినవి అక్కరలేదన్నట్టూ నటించాల్సిన దుస్థితిలో ఈ నాటి స్త్రీ ఉంది. పురుషాధిపత్య సమాజం సిగ్గుపడాల్సిన విషయమిది.''

–కుప్పిలి పద్మ

# టి. వాణీ రంగారావు

## మళ్లీ బ్రతకడం కోసం

మనసులన్నీ కలుషితమైన చోట
తన్నుకుంటూ బ్రతుకుతుంటే
ఇన్నాళ్టికి
ఈ శరీరమనే చిత్రమయిన
యంత్రంలో
చిన్న రిపేరొచ్చేసింది.
చిన్న రిపేర్లయితే
నట్లు బిగించినట్లు
ఆయిలింగ్ చేసినట్లు
తెగిన తీగలూ
విరిగిన కోళ్ళూ
అతుకులేసుకున్నట్లు.
అతుకు లేస్తూనే ఉన్నా
ఇన్నేళ్ళూ ఇన్నాళ్ళూ
ఒక్కసారిగా
మొరాయించిన శరీర యంత్రాంగం
మనసునీ మెదడునీ ధిక్కరించి
సమస్త కార్యక్రమాల్నీ ఆపేసి
పెన్‌డౌన్‌స్ట్రయిక్ లాగా
ఒక్క షాక్ ఇచ్చాయి.
ఆః! నన్నేం చేస్తుందిలే
అనుకున్న మధుశాల ఈ శరీరం
అతి మధురంతో గడ్డ కట్టేసింది.
అప్పుడిహ ఏముంది?

గడియారానికి బాటరీలు
వెతకటం మొదలైంది.
కళ్ళూ కళ్ళజోళ్ళూ
కనుబొమలూ చర్మం రంగూ
తప్ప
మరేమీ కనిపించని
ఆకారాలు అనేకం
చుట్టూ తిరుగుతూ
చల్లని నవ్వుల్తో
చల్లని చేతుల్తో
తెల్లని దుస్తుల్లో
అక్క చెల్లెళ్ళు
అంతా బాగానేవుంది
ఎవరు వ్యాపారులో
ఎవరు విద్యార్థులో
ఎవరు ప్రయోగాలు చేస్తున్నారో
ఎవరు ప్రయోజకులో
తెలీని తనంలో
మనకిక్కడ ఉనికిలేదు.
మన మనసు కక్కడ చలనం ఉండనివ్వరు
మన కాలు మన చేయి
చివరికి మన ఊపిరి
మనదికాని స్థితి
ఒళ్ళు అనే యీ యంత్రంలో
పొల్యూషన్
నవ్వొస్తుంది.
ఓ జోన్ లేయర్ చిరిగినట్లు
ఎకలాజికల్ ప్రాబ్లమ్స్‌లో

అవని మునిగిపోతుందన్నట్లు
రక్తమంతా బ్లడ్ యూరియాతో
సీరమ్ క్రియాటనిన్‌తో నిండిపోయి
అసలు పని మర్చిపోయిన
ప్రభుత్వోద్యోగిలా
యంత్రాంగాన్నంతా
అయోమయం చేసింది.
కలుషితమైన సమాజంలా
కలుషితమైన ప్రభుతలా శరీరం
లంచాలుమరిగిన
ప్రజాప్రతినిధుల్లా
చుట్టూ స్వజనం.
తెల్లని పక్కమీద
సచేతనమైన మెదడుతో
సలక్షణమైన మనస్సుతో
సంకెళ్ళువేయబడిన ఉనికితో
పరాధీనపు కాలంలో
తమాషాగా ఉందిదంతా.
పిండికొద్దీ రొట్టె
కట్నంకొద్దీ మొగుడులా
డబ్బులు కొద్దీ వైద్యం.
ఆహా!
మనీ!
నీకెంత పవరు?
రూపాయిని పాపాయిలా చూసుకోక తప్పదు
అన్నదొక్కటే
నేనిప్పుడు నేర్చుకుంటున్నది.

(కవయిత్రి 1994 సెప్టెంబరు - అక్టోబరు మాసాలలో తీవ్రమైన మూత్రపిండాల వ్యాధితో బాధపడుతూ, డయాలిసిస్ పొందుతూ ఈ కవిత వ్రాశారు. వారికి కృతజ్ఞులం - సంపాదకులు)

# రావులపల్లి సునీత

## చరిత్ర లిఖిస్తున్న నిజం

మనిషి మానసిక అవసరం నుండీ
జరిగి....జరిగి....
మతం ఉన్మాదమై ఉరికిన నిజం...!
రాముణ్ణి రాజకీయంతో ఉరివేసి,
అల్లాని హంతకుడని....
బోనులో నిలబెట్టిన నిజం....!
సరయూ నది గుండెగదులు చిదిపి,
సలుపుతున్న గాయంపై ...
కాష్ఠం చల్లారనివ్వని నిజం....!
మానవ అనుబంధాన్నే మానభంగంచేసి
రాజ్యాధికార కాంక్ష.....నడిరోడ్డున
బట్టలిప్పుకున్న నిజం....!
నిజాల నిప్పు సెగలో...గుండెరగిలి ఘోషించింది!
ఎవడురా నాతల్లి గొంతు మీద కూర్చొని
గుండెల్ని గుద్దుతున్నవాడు??
ఎవడురా నాతల్లి వడిలో పడుకొని
సమైక్యతా ఛాతీపై గన్ను గురిపెట్టినవాడు??
మసీదైనా మందిరమైనా
మనశ్శాంతికి ఆలయమన్న
మానవ నేపథ్యాన్ని మరచి
మారణహోమంలో మీటుతున్న సంగీతాన్ని....
చరిత్ర లిఖిస్తూనే ఉంది!
క్షమించబోని భవిష్యత్తు....
రాజుకొంటూ, నీ కోసం కాచుకునే ఉంది!
నిజాల నెగళ్ళమంటలో
కాలం వేడెక్కుతూనే ఉంది!

# శిలాలోలిత

## నది ఒడ్డున నది

వాళ్ళు- ఒరిపిడి లేని వజ్రాలు.
అపరిచుతుల మొఖాల్ని దిగులుదోసిట్లో కుక్కుకునే
చందమామలు.
ఏవంకా మనస్సులోలేకున్నా
అష్టావక్రుల తీరైన బ్రతుకు ముళ్ళు.
ఒంటినిండా కణుపులై తేలుతున్న బాధల చిట్టడవులు.

❁ ❁ ❁ ❁ ❁

అమ్మంటేే అపురూపం.
నాన్నంటే అనూహ్యం.
వాళ్ళ రేపటి చితుకుల్లో ఎన్నడూ తడయారని నీటి మొక్కలు
వాళ్ళ ఒళ్ళంతా నాచు.
పచ్చని బతుకుకాక, పాకుడు పట్టిన నాచు.
ఎన్ని ఎదురు దెబ్బల్లో గోళ్ళు ఉరేసుకొన్నాయో
ఎన్ని ఛీత్కారాల్లో ఒళ్ళు నిస్సిగ్గై నిలిచిందో.
ఎవరికి పుట్టుంటాడనే సి. ఐ. డి. కళ్ళు.

❁ ❁ ❁ ❁ ❁

గోదారి గట్టుకి షికారుకెళ్ళినంత ఈజీగా
వాళ్ళకు జీవితాలు దానం చేయబడ్డాయి.
పసి మనసులకు శరీరాలు తొడగబడ్డాయి.
బతుకులకు కంచుతాపడం చేయబడింది.
గాజు ముక్కలు వాళ్ళు-
మెరుస్తారేకానీ, నవ్వలేరు.

తోలు బొమ్మలు వాళ్ళు-
ఆడతారేకానీ, బతకలేరు.
ఈ సమాజపు విస్తరినుంచి
విసిరేసిన మెతుకులు వాళ్ళు.
వాళ్ళ బొంతబతుకులను
ఏ చరిత్ర అమ్మలా ఒడి చేర్చుకొంటుంది?
ఏ భవిష్యత్తు నాన్నలా రక్షణనిస్తుంది?

❋ ❋ ❋ ❋ ❋

సూర్యుడు అందరిళ్ళల్లోకీ చొచ్చుకుపోయినట్లే
వాళ్ళనూ ఓ సారి తడుముతాడు.
అలా క్యాజువల్‌గా వచ్చెళ్ళిన సూర్యుడ్ని మాత్రం
అమాయకపు గుప్పిళ్ళలో ఒడిసిపట్టుకొని
మధ్యాహ్న ప్రభాకరులై జ్వలిస్తూ వాళ్ళు.
వాడి ఆవేదనల మంచును
ఏ సమాజకిరణమూ కరిగించడంలేదు.
వాడి కళ్ళల్లోని దిగుడుబావుల జలపుష్పాల్ని
ఏ మానవత్వం వీక్షించడంలేదు.
ఎందుకు పుట్టారో
ఎవరికి పుట్టారో
ఎలా పుట్టారో ---తెలీనేలేదు.

❋ ❋ ❋ ❋ ❋

తాగి, వాగే నాన్న కరుకుచేతుల్నుంచి
కాపాడేందుకు ఏ తల్లి ఒదిలేసిందో--
మానాభిమానాల్ని పగలే దోపిడీచేసే
ఈ అరాచక సామ్రాజ్యంలో

ఏ పసి తల్లి ఒడినుంచి జాలువారిన నెత్తుటిచుక్కో--
ప్రేమ పందిట్లో, అచ్చటముచ్చటలాడిన
అడ్రస్ లేనివాడి వర ప్రసాదమో--
మూర్ఖత్వంతో, కంటూపోయిన కుచేలుని కడగొట్టువాడో
అమ్మకుంతై, అల్లల్లాడి వదిలేసిన నీటిమొగ్గో
విశ్వామిత్రుడు ఒదిలెళ్ళిన పత్ర బిందువో
ఎవరీ అనాథ ఆకాశాలు.
ఆకలి పేగుల లుంగల్లో తనను తాను తాకట్టు పెట్టుకున్న
భరతమాత ఎంగిలి ముక్కలో
మదాంధుల రాక్షస కృత్యానికి
జడిసి, కురిసిన వర్ష బిందువులో-
యాక్సిడెంటై అమ్మానాన్నల్ని
లాక్కెళ్ళిపోయిన కాలపు చిరునామాలో--
చుట్టూవున్న ఆస్థిదేగే ఏమీలేనితనంగా
మార్చేందుకు విసిరేసిన చిల్లపెంకులో--

❊ ❊ ❊ ❊ ❊

వాళ్ళను ఎన్నో కళ్ళు చూస్తూంటాయ్
కానీ వేటికీ స్పర్శ వుండదు.
ఏ చూపులూ వాళ్ళను నిలువెల్లతడమవు
తడియారని వాళ్ళ గుండెలక్షిపణిని
ఏ స్పర్శా ఆదుకోదు.
అమ్మా నాన్నలకోసం
అమాయకపు పక్షులై అలా శరాణాయలపు కొమ్మలమీద
రెక్కల్లోకి ముడుచుకొని ఎదురుచూస్తూనే వుంటారు

(అనాథలకు అంకితం)

# శీలా సుభద్రాదేవి

## పూచిన అనుభవం

స్వప్నంలో జీవించే కన్నా
జీవితాన్ని స్వప్నిస్తే అర్థవంతమౌతుంది
కలలైనా కవితలైనా జీవితాన్ని
దాటుకుంటూ వెళ్ళనిస్తే నేలవిడిచి సాముచేస్తాయి
జీవితంలోంచి నడిచొచ్చిన కవితలు
అడవిలోంచి నడిచొచ్చిన మనిషి వాసన వేస్తాయి.
మనిషై కన్న కలలు సజీవమూర్తులౌతాయి
జీవితం వెంట కప్పదాట్లతో పరుగెత్తటం
ఏ ఎదురు దెబ్బో తగిలేసరికి
చటుక్కున్న చతికిలపడిపోవటం
జీవితాన్ని ఆడిపోసుకోవడం
అదికాదు చేయాల్సింది
జీవితాన్ని ఒడుపుగా పట్టి పెంపుడుపిల్లిని చేసి
తన వెంటతిప్పుకోగలగాలి
జీవితం పూచిన అనుభవాల దండైతే
కవిత్వం అర్థవంతమైన అక్షరమాల
ఆకురాతిపై అరగదీసిన వాక్యమైనప్పుడు
అక్షరాలు బలమైనవే
ఎదురుదెబ్బల్తో రాటుదేలిన జీవితం
ముమ్మాటికీ బలమైనదే
నమ్మినదారిలో నడిపినప్పుడు
అక్షరాలు నిబద్ధమైనవే
నమ్మిన ఆశయాల్ని వదలనప్పుడు
జీవితం క్రమబద్ధమైనదే

కాగితాలమీద వెదజల్లితేనే కాదు
జనం గుండెల మీద దిద్దినపుడు
అక్షరాలు పదునైనవే
అవసరం కోసమో అవకాశంకోసమో కాక
జనాన్ని గుండెల్లో చూసినప్పుడు
ప్రతి జీవితం ఒక మహా కావ్యమే.

---

'' నా వంటిల్లొక యంత్రశాలలా వుంది
రకరకాల చప్పుళ్ళతో ఈ వంటిల్లు
ఒక కసాయి దుకాణం లావుంది.
కడిగిందే కడిగి, ఏళ్ళుతరబడి, వండీ, వండీ
వడ్డిస్తూ, ఎంగిళ్లెత్తేసుకుంటూ.....
చివరకు నాకలల్లోనూ వంటిల్లే-
కళాత్మకమైన వంటింటి కలలు.
మల్లె పూవుల్లోనూ పోపు వాసనలే!
ఈ వంటింటిని తగలెయ్య
ఎంత అమానుషమైందీ వంటగది!''

–విమల, 'వంటిల్లు' కవిత నుండి

---

'' స్త్రీ పురుషులు నిజమైన స్నేహితులూ, దంపతలూ కావాలంటే
ఇద్దరికీ సంపూర్ణమైన స్వేచ్ఛ వుండాలి.
ప్రేమ బంధమేకాని అధికారబంధం వుండకూడదు.'

–చలం

# దివాకర్ల రాజేశ్వరి

## సగం బొమ్మ

సగం బొమ్మగా
నీకు పరిపూర్ణతనిచ్చిన
సుందరభావ చిత్రాన్ని
కాళిదాసు కవిత్వంలో
వాక్కునకు గల అర్థాన్ని.
నీచే పూజింపబడి
దేశంలో
దేవతలను నెలకొల్పిన
నిండు గౌరవాన్ని
ఒక పరి వేదనలో
జన్మనిచ్చి
మమతానురాగాలతో
ఇంటి తలుపులు
తెరిచిన నిత్యచైతన్యాన్ని
పల్లెటూరి ఏటి ఒడ్డైనా
పట్నవాసపు నడిబొడ్డైనా
బాధ్యతల
కర్మాగారంలో నలుగుతూ
జీవన ప్రాకారాల్లో
పరిమళించిన
తాంబూలపు చెట్టును
నీతోటి సహజీవనంలో
నన్నర్థం చేసుకుంటే

నీవు పూలకొమ్మల పూజారివి.
లేకుంటే
అడవులను అమ్మేసి
నగరాలను కోల్పోయిన
బికారివి.

## ది డూప్లికేట్ కీ

అమ్మకూ,
పాపకూ
మధ్య
అనరాగపు టెండమావి
డూప్లికేట్ కీ.
అమ్మ రోజూ చెప్పే
జాగ్రత్త తలుపులవెనుక
ఎదురు చూపుల పాపకు
ఈ మరో తాళంచెవి
చిన్ననాటి నుంచీ నెచ్చెలి.
రహదారి
దీపాల వెలుగు నందుకుంటూ,
ఆఫీసు యంత్రమైన అమ్మ మనసు
పోతబోసిన ఇనుప తాళమై
పాప కంపసు బాక్సులో
పెన్సిలు ముల్లుకు గుచ్చుకుంటూ,
బాధగా ఒత్తిగిలుతుంది.
కాలచక్రాలను
కాళ్ళకు చుట్టుకుని
కాన్వెంటు గూనివీపు

సరిచేసుకుంటూ
ఇంటికి తిరిగివచ్చే, పాప
వంటరి సాయంత్రంలో
ఇంకా
మరచిపోలేని
అమ్మమ్మ జ్ఞాపకంలా
కొక్కానికి వేళ్ళాడుతుంది
డూప్లికేట్ కీ.

---

'' రాత్రిని లిఖించే నక్షత్రాక్షరాలు
పెదవుల మధ్య పూరేకుల విరిసిన నవ్వులు
రాలిన ఆకులతో
చెట్ల మధ్య సన్నటి కాలిబాట
చెరువు మీద తెల్లని బాతులు
ఆరకుండా వెలిగే సూర్యుడు
ఆకాశాన్ని తాకే అడవులు
ఎలివేటర్ లో పరిచయాలు
ఎప్పుడూ కొత్తవే!''

– జయప్రభ

---

'' అటు పితృస్వామ్య వ్యవస్థనీ, యిటు సొంత ఆస్తినీ
పునాదులతో సహా పెకలించినప్పుడు మాత్రమే స్త్రీకి
నిజమైన స్వేచ్ఛ!''

– పి. సత్యవతి

# శికాకొల్లు లక్ష్మీ మోహన్

## పరుగు పందెం

నీలంగా నిర్మలంగా ఆకాశం
గజిబిజిగా కలుషితంగా మానవ మనస్సు.
క్షణ భంగురం ఈ జీవితం-
అయినా అనుక్షణం ఎందుకో ఈ పరుగు పందెం !
రంగురంగుల హరివిల్లుపై వ్యామోహం
ఎంతకూ అంతుచిక్కని సందేహం
ఊపిరాడదు, క్షణక్షణం ఊపేస్తోంది మనస్సును
అయినా ఏం ప్రయోజనం?
ఏవీ ఆగవు ఏ ఒక్కరి కోసం
ఇలా సాగాల్సిందే ఈ మనుగడ మనకోసం
అందులోనే వెతుక్కోక తప్పదు జీవిత పరమార్థం
అదైనా మిగుల్చుకుందాం ఆత్మతృప్తి కోసం!

## స్వామి వివేకానంద

జ్ఞానసుధను నిండుగా నింపుకున్న నీ జీవన భాండం
నిండు నూరేళ్లు మనకుండానే పగిలింది.
అయినా ఉన్నకొద్ది ఏండ్లలోనే
కటికి చీకట్లో పయనించే మా కోసం
ఎన్ని దివ్యజ్యోతులు వెలిగించావు!
నీ గంగాప్రవాహ సదృశ వాగ్ఝురి
ప్రపంచమంతటా ఇంకా ప్రవహిస్తూనే ఉంది
నీవు వెదచల్లిన కాంతిపుంజాల వెలుగులో
భరతజాతి అభ్యంగన స్నానం చేస్తోంది
నీవు ప్రతిపాదించిన మనవతావాద అద్వైత సౌరభం
ఈ భూమండలాన్ని పునీతం చేస్తోంది.

## జయ

# మగోన్మాదం

మూడు కొంపుల మాంసం ముద్ద అనుకుని
ఆడతనం కామశిలగా మార్చిన చోట
ఉన్మాదం వూళలేస్తుంది
కోరిక కట్టు తెంపుకోటానికి-
అబలత్వమే జీవితమని మిగుల్చుకున్న
బలహీన అవశేషాల్లో వుండి
ప్రతిఘటన సైతం పశుబలం ముందు ఓడిపోతుంది
గొంతుదాటి ఎగిసే చావు పెనుకేక సైతం
చలనశక్తి వుందని తెలియకనే నిర్జీవమవుతుంది
స్వేచ్ఛాచాపమెత్తి ఒంటరిగా నడిస్తేనే
అందుకూ కారణాల నీచాలు ఆపాదించి
తమ అవసరాల అసహ్యాన్ని ఇతరుల్లో తడుముకొని
వికృతీకరించబడతాయి
వస్తావా రాత్రికి?
ప్రశ్నార్థకాలు అనవసరమౌతాయి
ఇష్టమో, అయిష్టమో
జవాబుల తీగె తెగిపోతుంది.
ఏదీ పట్టనట్టు నీ దారిని పోతావా
మగోన్మాదం బరిలో తెగించే మరణావస్థ-
విషం కోరలో నింపి పడగెత్తి నిల్చిన
పాము క్రూరత్వంలా-
మగతనానికి మంటెక్కి- వికారచేష్టల్ని
నిన్నేదో పరీక్షించటానికన్నట్టు
ముందో వెక్కిరింత సకిలింపు నిచ్చి
గోడకు గీరుకునే దున్నపోతులా

ఒళ్లు రాచుకెళ్లే ప్రయోగమూ చేస్తాడు
నీకవసరమేమో అనుకుని
మాటల దుర్గంధాన్ని వెదచల్లి చిత్రవధ చేస్తూ
రా.....పడుకుందాం ఎంత సేపూ......
నీ బాధా తీరిపోతుంది.
ఎవరో ఒకరనే నీళ్లమూటలాంటి వికృత వాంఛలకు
అత్యధిక ఉష్ణోగ్రతలో మరిగిన ఉక్కు ద్రవం
అకస్మాత్తుగా మీదపడితే నజ్జు నజ్జు అయినట్టు-
మనసుకున్న ప్రాణశక్తి ధ్వనుల్లోంచి
రసాత్మక హృదయం వెక్కి వెక్కి పడుతుంది.
కళ్లెర్ర జేసి ఎదిర్చి నిలుస్తానా-
భయంతో పాటు ఏమీ ఎరుగని తనాన్నీ
కంగారుతో కలగలిపిన కఠినత్వాన్నీ
ఇంకా వీలుంటే దౌర్జన్యాన్నీ సిద్ధం చేసుకుని
జీవన వికారాల్ని చిత్తకార్తి కళ్లల్లో చూపెడుతూ-
తన్ని తగలెయ్యాలని మెడ పట్టుకుని గుంజానా
తననేదో అన్యాయంగా కొట్టి నిందిస్తున్నట్లు
అసలు నిన్నేం చేశాననే ఎదురు ప్రశ్న!
దాడిపై తిరిగి ఎదురాడి అస్త్రంగా చేసుకుని-
నాలో ఆ క్షణాలలో జలదరించే
వికృత ప్రకంపనను పసిగట్టే నేర్పే నీకుంటే
నిలువలేని నీ మగోన్మాదాన్ని
నీవే ఆత్మహత్య చేసుకుంటావు.

❋ ❋ ❋ ❋ ❋

# మారుతీ శ్రీలత

## అగ్ని పరీక్ష

న్యాయం ధర్మం వదలి
మనసు మమతలు దూరంకాగా
సాగే ఈ నాటి స్త్రీ జీవితం
తరతరాల ద్వేషానికి బలి అయి
సానుభూతికి కూడ నోచుకోని జీవితాలు
అడుగడుగునా అనుమానాల రొంపిలో కూరుకొని
భర్త అనే ఆత్మీయుడు
జీవిత ప్రాంగణాన అడుగిడిన ఆనందంలో
అనుక్షణం అతని సేవలో జీవితాన్ని పణంగా పెట్టి
ఇల్లాలిగా
తల్లిగా
మారి అతనికి తోడుగా, నీడగా
మెలగాలని ఆశతో సాగిన 'వధువు'కు
అత్తమామల ఆదరింపు లేక
ఆడపడుచుల సాధింపులతో
తొలిప్రొద్దు తెల్ల వారుతోంది!
తన జీవితం పగటి కల అనే
సత్యం గ్రహించలేక
గానుగెద్దులా మారుతోంది.
ఆమె ఓకానీ ఖర్చులేని బానిస
పుట్టగానే కన్నవారికి బరువై
ఆశలకోర్కెలు మొగ్గలుగా త్రుంచి
వారి కనుసన్నలలో మెలిగి
బానిస జీవితం

బానిసగానే భార్యగా మారి
మారని మనస్తత్వంతో సాగి
కడకు బిడ్డలకు తన ముసలితన్నాని
బహుమతిగా ఇచ్చి
బానిసగానే మరణిస్తుంది-
స్వేచ్ఛలేని స్త్రీ జీవితాన
బ్రతికున్నది తల్లి గర్భాన దాగిన నవమాసాలేననే
నగ్న సత్యం గ్రహించలేక.
స్వేచ్ఛలేని జీవితంలో
ఆర్థిక స్వేచ్ఛ ఎందుకు?
ఓ అగ్నిగుండంలోనుంచి ఇంకో అగ్నిగుండంలోకి
మారడానికి ఎందుకు స్వేచ్ఛ?
మానవాళి మనస్తత్వం మారనంతవరకు
పురుష ప్రపంచంలో మార్పురానంతవరకు
ఈ స్వేచ్ఛ స్త్రీకి మరో అగ్ని పరీక్ష!

---

''స్త్రీకి కూడా శరీరం ఉంది -
దానికి వ్యాయామం ఇవ్వాలి
ఆమెకి మెదడు ఉంది -
దానికి జ్ఞానం ఇవ్వాలి
ఆమెకి హృదయం ఉంది -
దానికి అనుభవం ఇవ్వాలి !''

- చలం

# యెనిశెట్టి శ్రీ రంగనాయకి

## సర్కస్‌కళ

అక్కడ-
గాలి అద్భుతాన్ని పీలుస్తుంది
కాంతి అద్భుతాన్ని చూస్తుంది
భూమి ఊపిరి బిగపడుతుంది
ఆకారం ఒళ్ళంతా కళ్ళుచేసుకొని....
తొంగిచూస్తుంది
ఇక
తళతళలాడే షోకేస్ అందాలు
మనకు
సజీవంగా కదిలే తీగలూ.....
చైతన్యంతో ఊగే ఉయ్యాలలూ....
శాంతించిన అడవి క్రౌర్యం
సహకరించి పూజించే కరి ఘనకార్యం
ఒక్కటై
కాలస్తంభన విద్యకు కళాకాంతి నింపుతాయి!
ప్రతి నిముషం అనిమిషమై
అద్భుతాన్ని పండిస్తుంది.
మనమందరం
కూర్చున్న బహువచనాలం
చూస్తున్న ఏకవచనం!
సర్కస్ కళలు
ఎగురుతుంటాయి,
ఊగుతుంటాయి,
దూకుతుంటాయి

వారి మృత్యుపరదాలే
మన సరదాల
మానవ యంత్రాలు
మంత్ర విన్యాసాలు చేస్తూ.....
మనల్ని
''!''లో ముంచుతాయి
కాళ్ళు టంగులరాట్నం ఎక్కి
తల్లి కష్టాను కావలించిన పిల్లల
భయంనవ్వు
గునపమైన నా గుండెను గుచ్చుతుంది!
చిన్నారి ఒళ్ళు
చక్రి చూపుడు వ్రేలై
చక్రం త్రిప్పితే.....
చప్పట్ల కాంతి కురుస్తుంది!
శరీరం ''స్వామి చాపాకృతై''
విశ్వనాథ వర్ణనను
వీనుల్లో ప్రతి ధ్వనింపజేస్తుంది!
వారు
దిగంతాలకు ఊగుతుంటారు
మా చూపులు
ఆకాశంలో అతుక్కుంటాయి!
తాళ్ళపై నడిచే
బెబ్బులి లేజర్ కళ్లు
ముడిచిన పంజాగోళ్లు
మా పెంపుడుపిల్లికి నకళ్ళు!
సున్నాలు గీస్తున్న సైకిళ్ళపై
అబలవర్తుల సంచలత్ పిరమిడ్లు!
భీమబలుని భు....జా....ల....పై

ఇనుప గుండాట!
పెళ్ళి జంట చెండాట!
అరచేతి మైదానంలో.....
బంతి భూమిని తిప్పే,
మారడోనాలే కాదు,
సింహ దుర్వాసుడు సైతం
శిక్షణ పొందే స్కూలు అది!
జీవన సామరస్యం పూలు పూచి
కదిలివచ్చే కణ్వాశ్రమం అది!
మనసు మెలంఖలీని
మాయంచేసి
పెదాలపై ప్లాస్టిక్ నవ్వుతో
ఆ, ఆటకే
చక్కిలిగింతలు పెట్టే
జోకర్
జీవితంలో జీరో అవుతాడు.
మనల్ని మండించే సూర్యుడు
వారికి మంచి మిత్రుడు.
ఎండను కో....స్తూ
వానవస్తే,
ముసురు ముఖాలను
బ్రతుకు వలలనూ చుట్టి
ఓ మూలకు పెట్టిన
చాపలవుతారు.
చిరునామలేని చందమామల్లా
విన్యాసాల వింతవెన్నెలతో....
ఊళ్ళు ఇళ్ళు తిరిగే
వారాలబ్బాయిలౌతారు.

చావుకీ, బ్రతుక్కీ
మధ్య
త్రిశంకు స్వర్గంలో
ఊగే ఉయ్యాలలై
రక్తపు అన్నం తింటూ వాళ్లూ,
రససౌరభాలు పీలుస్తూ మనం!!
వాళ్ళ సర్కస్ బ్రతుకుభయం
మనకో అద్భుత రసమయం!!!

## అనామిక

మెదడు రహదారిలో
పాదముద్రలు పలుకరిస్తున్నాయి.
గొంతుగిన్నెలోంచి జ్ఞాపకాల కుసుమాలు
కన్నీటి దారంతో అల్లుకుంటూ....
పైపైకి పెల్లుబుకుతున్నాయి.
మెత్తని మాటలూ, మాయలవాగ్దానాలూ...
మంచు తు.....న.....క.... లౌతున్నాయి.
ఎదురుచూపుల నుదుటిపై,
నీ పరిహాసం అపహాస్యపు గీతలుగీసింది.
చక్కని జీవితపు గూట్లో చిక్కని సాలెపురుగులా నీవు
నువ్వొస్తావని భ్రమమొక్కపై
ప్రతిక్షణం పారసైట్‌లా బ్రతికే నేను.

❋ ❋ ❋ ❋ ❋

# పల్లవోలు మాధవి

## ద్వైతం

1

నువ్వు కోటి కిరణాల సూర్యుడివే
కానీ
నేను నీ కోసం ఎదురుచూడని బుడగ తామరని
నువ్వు చుక్కల రాజువే
కానీ
నేను నీ ప్రక్క నిలువలేని తోకచుక్కని.
నువ్వు స్వాతి చినుకువే
కానీ
నేను నువ్వనుకున్నట్లు
భూమిని కాను
పాముని అంతకన్నాకాను
ఆల్చిప్పను అసలేకాను!

2

మేఘుడనే నేతగాడు
వర్షమనే మగ్గంలో
భూదేవికి ఒకేఒక ఆకుపచ్చచీర నేశాడు.

3

మట్టి రోడ్డులో పొడరు రాసుకున్న బస్సు
తారు రోడ్డు మిలమిలలో తన అందాన్ని చూసుకుంటుంది.

4

చీకటి నన్ను శాసిస్తోంది
నీ ఆలోచనలతో గడపమని
కానీ

వెలుగు నన్ను పరిహసిస్తోంది
గడపలేవు అని.

**5**

అతివా! నీ అధరామృతాన్ని గ్రోలాలని ఉంది
కానీ
నేను షుగర్ పేషంటుని.
కాంతా! నీ కళ్ళల్లో కళ్ళు పెట్టి ఊసులాడుకోవాలని ఉంది
కానీ
నాకు కండ్లకలక వచ్చింది.
సుదతీ! నీ సుందర సుకుమార దేహాన్ని స్పృశించాలని ఉంది
కానీ
నేను చర్మవ్యాధిగ్రస్తుణ్ని.
రమణీ! నువ్వు రాసుకున్న మైపూతని ఆఘ్రాణించాలని ఉంది
కానీ
నాకు డస్ట్ ఎలర్జీ ఉందే!

---

''తను పుట్టడానికో తల్లి
తన పిల్లల్ని పుట్టించడానికో పెళ్లాం తప్ప
మరో ఆడది భూమి మీద ఉండనక్కరలేదని
పరమ కిరాతకానికి మారణ హోమానికి
సాక్షులుగా నిలబడ్డ అవమానం మనది
బలహీనపడకు''

– జయప్రభ

# పెద్దయ్యగారి తులసి

## స్వాగతాంజలి

వసంత శోభిత ప్రకృతి కాంతా!
నీకై వేచి చూస్తున్నారు చిలకమ్మలంతా
వీనుల విందైన రసధునుల పిల్లతెమ్మెర లేవమ్మ
చిగురుటాకుల తాళాలు ఎక్కడమ్మా
గున్నమావి రెమ్మల కోయిలమ్మలు
పురివిప్పి ఆడుతున్న నెమలి రాజులు
సన్నజాజి మల్లెతీగ పూల తోటలు
కరముల పూసిన విరిపూలతో
తెలుపుతున్నవి నీకై స్వాగతాంజలులు
తెల్లని జాబిల్లి వెన్నెల వెల్లువలు
పరవళ్ళు త్రొక్కే నదీనదాలు
ఎదురు చూస్తున్నవి నీకై స్నేహరాగాలతో
చర్వితచర్వణమే నీ మంజరీనాదాలు
ఓ తరుణీ! ఇది నీ తరుణములే.

## చంద్రస్పర్శ

కలువ కన్నులు నీకై ఎదురు చూసేవేళ
మబ్బుచాటున దాగిన చంద్రమా!
ఎదురుచూసే కన్నులే లోకువయ్యాయా?
లోకుల పోకళ్ళు మనకెందుకోయ్ మిత్రమా!
వికసిత కుసుమ విరాజితమా!
హృదయ మధుర సంస్మరణమా!
చల్లని వెన్నల చందమామా!
పసిడి కాంతులు నిండిన ఓ చంద్రమా!
శాంతికి నీవే చైతన్య చిహ్నం
భావరహిత హృదయాలకు సైతం స్పందనం
వెండి జిలుగుల చందమామా!
నిండు వెలుగుతో మెల్లగా స్పృశించుమా!

# చిన్నావుల నాగేశ్వరీదేవి

## నవరత్నాలు

1

మేఘమాలిక
అవిశ్రాంతంగా పయనిస్తోంది
సూర్యకిరణాలలో తరగాలని,
నా రాగమాలిక
తుళ్ళి పడుతోంది
నీ ప్రణయ సముద్రంలో లీనమవ్వాలని.

2

సువాసనా భరితమైనా
మొగలిపొదను దరిచేరడానికి జను లిచ్ఛగింపరు.

3

ప్రియుడైన పవనుడిని కలసిన పుష్పం
గుర్తుగా పరిమళాన్ని పంపగలిగానని ఆనందిస్తుంది.

4

గ్రద్దకెంత సూక్ష్మ దృష్టి ఉన్నా
పాములు శ్లాఘింపవు.

5

చాక్‌పీస్ :
''ఓహో! తెల్లని నా శరీర ఛాయముందు నువ్వెందుకూ పనికిరావు''
బ్లాక్ బోర్డ్ :
''అలా విర్రవీగుతావు కనుకనే నాపై తరిగిపోతావు.''

**6**

రంగులు వేటికవే తమగొప్పతనాన్ని చాటుకుంటాయి అధముల్లాగ
కానీ అన్ని రంగులనూ తనలో ఇముడ్చుకున్న తెలుపు నిర్మలంగా
ఉంటుంది గొప్పవారిలాగ!

**7**

విజ్ఞులు నాగరకతలోని వ్యక్తిత్వాన్ని హర్షిస్తారు
అజ్ఞులు నాగరకతలోని నవ్యత్వాన్ని వరిస్తారు.

**8**

ఎఱ్ఱభాస్వరం ఎగిరి పడుతుంది వంటచెఱకు నంటించగలనని
కానీ దానికి తెలీదు తను మసిగా మారుతున్నానని.

**9**

అధికారం ఉన్న వ్యక్తీ, తలపై కేశాలూ, పొందే గౌరవం ఒక్కటే
పదవీ హీనులకూ, స్థానాన్ని వీడిన కేశాలకూ, లభించు గౌరవం
ఒక్కటే.

---

'' అందమైన దోపిడికి
పవిత్రమైన హింసకు
న్యాయమైన దాస్యానికి
బలైపోయిన నేను
భారత స్త్రీని!''

– ఓల్గా

# కె. అంజనీ బాల

## ఆరని తడి

ఆ యింటిని వదిలి వస్తోంటే
దుఃఖం తప్ప మరేమీ రాలేదు.
ఆ యింట్లో ఆ ఇద్దరూ తప్ప
తోడెవ్వరూ లేక ఒంటరి వాళ్ళయిన
అమ్మమ్మని, తాతయ్యని వదిలివస్తూంటే
దుఃఖం తప్ప మరేమీ మాట్లాడలేకపోయాను
ప్రతిరోజూ నిశ్శబ్దంగా
మనుషలే లేని ఇంట్లో తిరిగే నిశ్శబ్దంలా
లోపల ఎక్కడో అమ్మమ్మ పనిచేస్తున్న చప్పుడు తప్ప
ఇక ఆయింట్లో మరే చప్పుడూ విన్పించదు
రెక్కలొచ్చాక ఎగిరిపోయి,
సొంత గూళ్ళు కట్టుకున్న
తనవాళ్ళకై ఎదురుచూసే
రెండుపక్షుల్లా అమ్మమ్మా, తాతయ్య.
మీరొస్తున్నారని కలొచ్చిందని తాతయ్య
ఉత్తరంలో రాసిన మాటలే,
ఆ ఇంట్లో దిగగానే ఆయన కళ్ళల్లో
సుడితిరిగిన కన్నీళ్ళు మళ్ళీ మళ్ళీ చెప్పాయి.
ఇంత మౌనం ఇక్కడ పర్వతంలా పెరిగితే
మా వేసవి సెలవుల ఆటల పాటల
అల్లరి అరుపుల గునపాలతో
ఆ ఇంట్లోని ఒంటరి నిశ్శబ్దాన్ని,
ఒంటరి తనాన్ని తవ్విపోసాం.
వృద్ధాప్యం వాళ్ళ ముఖాల మీద

ముడతలుగా సంతకం చేసి
వాళ్ళను ఒంటరితనంలోకి నెట్టి వెళ్ళిపోయింది.
మేము ఉన్న ఆ రెండు నెలలూ
మాతో పసిపిల్లలయ్యే వాళ్ళు.
సెలవులు ముగిసిపోయి
మేము తిరిగి ప్రయాణమైనప్పుడు
అమ్మమ్మ దుఃఖాన్ని తాతయ్య
తాతయ్య శోకాన్ని అమ్మమ్మ
విలపించేవాళ్ళు
వాళ్ళక్కడ ఆ ఒంటరితనంలో ఉండలేక
నగరశబ్దాల్లోకి రాలేక
మా ముఖాల్లోకి బెంగగా చూసినప్పుడు
కాలం మీద కోపం.
తాతయ్య అయితే దుఃఖాన్ని తుడుచుకొని
బస్సెక్కించాడు కాని
తాతయ్య ఇంటికెళ్ళిందాకా అమ్మమ్మ ఒంటరిదే కదా!
ఆ తరువాత ఇద్దరూ ఒంటరి వాళ్ళే
బహుశా ఇంటి కెళ్ళిన తాతయ్య
మళ్ళీ వస్తారులేవే అని
అమ్మమ్మ కన్నీళ్ళను తుడిచి
తానేడుస్తాడేమో?

❆ ❆ ❆ ❆ ❆

# మంగళగిరి ప్రమీలాదేవి

## స్త్రీ

గులకరాయి
అందమైన తరంగాలను
అనంతంగా సృష్టించింది
కానీ
ఏ అగాధాలలో పడి
అదృశ్యమయిందో
ఎవరికి తెలుసు?

## నేను

వనితను మొదట నేను
యువజన మనోహారిణిని నేను
ప్రతీకను విద్యా సంపదలకు
కాణాచి నొకప్పుడు కళలకు
ఐతే
ఆ తర్వాతే
అడ్డం తిరిగింది కథ!
ఓర్పుకూ నేర్పుకూ
పుట్టినిల్లైన నేను
ఓటమికి మరొక మారు పేరుగా
అంతర్ద్వం ద్వాలలో
ఆరుతూ వెలుగుతుండే
జీవితపు తృషిత గాథగా
మిగిలిపోయాన్నేను!
అబలను అంటారందరూ
అది నిజమో, కాదో, ఏమో
మరి నా మనసు మాట!

పర్వతం మౌనంగా ఉండవచ్చు
ఐతే తరిగిందా దాని ఉన్నతి?
సామాన్యంగా కనిపిస్తుంది సముద్రం
అంత మాత్రాన అంటారా
అది లోతైనది కాదని?

---

## బందిపోట్లు

' పాఠం ఒప్పచెప్పకపోతే పెళ్లిచేస్తా' నని
పంతులుగారన్నప్పుడే భయమేసింది;
' ఆఫీసులో నా మొగుడున్నాడు
అవసరమొచ్చినా సెలవివ్వ' డని
అన్నయ్య అన్నప్పుడే అనుమానమేసింది;
' వాడికేం? మగమహారా' జని
ఆడా మగా వాగినప్పుడే అర్థమైపోయింది-
''పెళ్లం''టే ''పెద్ద శిక్ష''అని ;
''మొగుడం''టే ''స్వేచ్ఛా భక్షకు'' డని ;
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని!

– సావిత్రి
(మార్చి 1984)

# వి. శ్రీదేవి

## ఇంకా ఎన్నాళ్ళు?

ముందు అసూయ పుట్టి
ఆ తరువాత నువ్వు పుట్టావట
ఈర్ష్యాసూయలు నీకు తోబుట్టువులట
ఎంత అందంగా పులిమారు
నువ్వు సహనశీలివన్న కుంకుమ బొట్టు!
నీ నుదిటి మీద చరిత్ర చెక్కిన
నెత్తుటి చుక్క-
సంస్కృతి నిన్ను భారత స్త్రీవనే
విశ్వాసాల ఊబిలోకి నెట్టింది కదా!
నువ్వెందుకు బయటపడవ్?
నువ్వేది ఆభరణమనుకుంటున్నావో
అది నీ బలహీనత
అదొట్టి నీ అశక్తత
వాళ్ళ ఆయుధం కూడా అదే
నువ్వెలా అతనికి సొంతమో
అతనూ నీ కలా కావాలనుకుంటావ్.
అసలెవరైనా ఎందుకు
ఒకరికొకరు సొత్తు కావాలి?
అసలెందుకు ఎవరో ఒకరు
ఎవరికో ఒకరికి
బానిసో, యజమానో కావాలి?
అదిగో అక్కడే పుడతాయి
నీలో ఈర్ష్యాసూయలు
అయినా నీలో నువ్వుంటూనే
అతనిలో కూడా ఉంటావ్

నీ ప్రయత్నం నీదే
నీ చేతులతో కొనసాగించాల్సిందే
కానీ,
అతని దృష్టిలో నువ్వో వదిలించుకోలేని
జంఝాటానివి
కాలం గడుస్తూనే వుంటుంది
అకస్మాత్తుగా నీ బాల్యమిత్రులు
నీకు కనిపిస్తే
నువ్వో పసికందువై
తాత్కాలిక శాశ్వత సమస్యల్ని పక్కకు తన్ని
వాళ్ళలో మరీ చిన్నపిల్లవైపోయి
జ్ఞాపకాల రాళ్ళు ఏరుకుంటావ్
బహుశా నువ్వు ఏరుకునే రాళ్ళ మీద
వర్తమానం రెండు కన్నీటి చుక్కల్ని
రాలుస్తుందేమో
దొరికిన గతాన్నంతా అపురూపంగా
గుండెల్లో దోపుకుంటావ్
సంతోషంలో కట్టుబాట్ల
హద్దుల్ని నీకు తెలియకుండానే చెరిపేస్తావ్
కాదంటే మర్చిపోతావేమో
అతనేమో
నలుగురిలో కలిసి నవ్వే నిన్ను చూస్తాడు
బాల్యాన్ని తవ్వి చూసుకుంటున్న నువ్వు
ఆతని అధికార కళ్ళకి అస్సలు కనిపించవ్
నీలో బాల్యాన్ని, పసిపిల్లనీ కాక
బరితెగించినతనాన్నే చూస్తాడు
తెల్లారో మరికొన్నాళ్ళకో
కన్నీళ్ళు తొణికే కళ్ళతో

వణికే చేతులతో
విడాకుల కాగితాల మీద సంతకం
నిన్ను కోస్తూ ఉంటుంది నిలువునా
నీకు మాత్రమే ఈర్ష్యాసూయలు
అతనైతే అతి తేలిగ్గా నిన్నొదిలించుకుంటాడు
అందుకే అవి నీకు
తోబుట్టువులు!

---

## ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిది?

సరిహద్దులు గీసుకున్నవి
మనుష్యుల స్వార్థాలుగాని
దూకే సెలయేళ్లు కావు
అడవులూ జలపాతాలూకావు
ఇక్కడ కురిసేవర్షం
ఎక్కడి మేఘం మోసిందో
గుర్తించగలవాళ్లుంటే రండి!
భూమి విశ్వరూపాన్ని
ముక్కచెక్కలు చేస్తున్నవి
మతాలూ మంత్రాంగాలూను
నిజంగా సరిహద్దులు చెరిపేయ గలిగితే
ప్రపంచానికి
నేలా నీరూ గాలీ అందరివీగాని
ఏడు ఖండాలుగా విడిపోయిలేవు.

– జయప్రభ

కన్నడ కవిత :

# ప్రతిభా నందకుమార్

## మన ఆడపిల్లల తీరే ఇంత....

**1**

ఔనే ఉషా
మన ఆడపిల్లల తీరే ఇంత....
ఏమేమో వాగుతాం కాని
చెప్పాల్సింది చెప్పకుండా
కుమిలి కుమిలి చస్తాం.
చక్కిలిగింత పెట్టే ఆలోచనల్ని
డబ్బాలోపల పిండి ఒత్తినట్లు
ఒత్తి ఒత్తి గట్టిగా చేస్తాం.
చెప్పి తీరాల్సిందే అనుకున్నదాన్ని
చెప్పలేక నత్తి నత్తిగా నానుస్తాం.
'ఐ లవ్ యూ' అని చెప్పటమే కష్టమైపోయి
ఏవేవో దార్లు వెతికి
సందేశం అందించటానికి అవస్థ పడతాం.
దాన్ని అర్థం చేసుకోలేని అబ్బాయిలు
దూరమైపోతుంటే
కుళ్ళి కుళ్ళి ఏడుస్తాం.
చివరికి మరెవర్నో పెళ్ళాడాల్సి వస్తే
మనం గొప్ప విషాదనాయికలమని భ్రమించి
అందరి జాలిని అపేక్షిస్తాం.
మొగుడనే వాడిలో 'వాడిని' వెతుక్కుంటాం.
మొగుడికి మాత్రం దాని సూచనే దొరక్కుండా నటిస్తాం
అంతలో అదిమిపెట్టిన భావనలన్నీ గట్టిపడిపోతాయి
అవి ఇంకేం వికసిస్తాయి ఉషా....

## 2

నాలుగేళ్ళలో బాగా ఊరిపోయి
చేతినొక బిడ్డ కాలినొక బిడ్డ లాగుతుంటే
ఎగశ్వాస పీలుస్తూ కూరగాయలు కొనేటప్పుడు
'అతను' కనిపిస్తాడు
ఈ నాటి మన అవస్థకు ఇతనే కారణం
అని ముక్కుపుటాలెగరేస్తాం.
అటు తర్వాత ముసిముసి నవ్వులు నవ్వుతూ 'అతని'
పెళ్ళాం పిల్లల యోగ క్షేమాలు విచారిస్తాం.
ఎందుకంటే ఆవిడదీ అలాంటి కథేగా?
మన ఆడ పిల్లల తీరే ఇంత.

**( అనువాదం : ఆర్వీయస్. సుందరం)**

**కన్నడ కవిత :**

# వైదేహి

## సూర్యుడా సుర్యుడా........

**చాడీ**

అరరే
తెల్ల గుర్రమా
సూర్యుడెక్కడికి వెళ్ళాడు?
మబ్బుల్ని అడ్డంగా పెట్టుకొని
పరుగెట్టి పరుగెట్టి
హంసపదిక ఇంటికెళ్ళి
తలుపేసుకున్నాడు.

## దాహం

ఏడు గుర్రాలకు
ఏడు రకాల దాహం
ఏడు సముద్రాల నీరు
తాగించి వస్తాననే నెపంతో
మెట్లు దిగాడు సూర్యుడు
ఎక్కడికి వెళ్ళాడో
చీకటి పడింది!

## పరిచయం

చూడు బాబూ
అతను సూర్యుడు
పగలంతా
ఆ అమ్మాయికీ ఈ అమ్మాయికీ
కురులు సవరిస్తూ
చీకటి పడగానే విరక్తుడి వేషం వేసుకొని
ఎక్కడికో వెళ్ళాడు.

## ప్రశ్న – సమాధానం

అమ్మా
ఈ సూర్యుడు ఎందుకు
వస్తాడు ? వచ్చిన వాడు
ఒక్క గడియ నిలవకుండా పరుగెడ్తాడు?
బాబూ,
అదంతే
రథమూ గుర్రాలూ ఉండే వాళ్ళంతా
అంతే.

నిజం అడిగితే

ఇప్పుడింత శాంతంగా వుంటాడు కదా
'' రాత్రంతా ఎక్కడున్నావ్ ? ''
అని అడిగి చూడు
పగలంతా
మండి పడుతూనే ఉంటాడు.

సలహా

అలాంటి సూర్యుడికీ
నల్ల మచ్చలున్నాయి అమ్మాయి!
అతన్ని ప్రేమించాలంటే
ఆ నల్ల మచ్చలతో బాటే
ప్రేమించాలి.

(అనువాదం : ఆర్వీయస్. సుందరం)

కన్నడ కవిత :

## స. ఉష

### అమ్మకు

మా అమ్మవుగదూ వద్దమ్మా
నింగిలోకి నీ పైటను ఎగరేసి
ఎండకు గొడుగు పట్టి బతుకులో పచ్చదనం
పోగొట్టుకోవద్దు
పదిహేడేళ్ళు నిండాయి పైట గాలికి వదిలేసి
కనిపించిన వాళ్ళకందరికీ కన్ను కొట్టవద్దు
గాలి గుర్రమెక్కి మగరాయుడిలా ఆడవద్దు అని

మీ అమ్మ వాళ్ళమ్మ వాళ్ళమ్మ
కాలంనుంచి నాలాంటి పిల్లల చెవిలో
ఊదర గొట్టినట్లు నా చెవిలోనూ
ఊదరగొట్టవద్దు
ఇప్పుడిప్పుడే పడగ ఎత్తుతున్నాను
ఎవరినైనా కరిచి విషం దించుకుంటాను
నాకు దారి ఇవ్వు.

ముంగిట్లో చెట్టుకు ప్రదక్షిణాలు చేసి
ముగ్గులు వేసి కైలాసం చూసి
గాలీ వెలుతురూలేని పీనుగులా పడివుండడానికి
నా వల్ల మాత్రం కాదమ్మా
నీవు కట్టిన ఆనకట్టను పడగొట్టి
జడివానలో తడిసి
ముందుకు దూసుకుపోయి
నీ కంటె వేరుగా బ్రతుకుతాను
నాకు దారి ఇవ్వు.

(అనువాదం : ఆర్వీయస్. సుందరం)

---

'' దూరమైన సూర్యుణ్ణి తలుచుకుని
బాధగా అనుకుంటాను
నేనొక వేకువనైనా కాలేనే అని!''

– జయప్రభ

పాకిస్తానీ కవయిత్రి :

# కిష్వర్ నహీద్

## పాపిష్టి ఆడవాళ్లం

గౌన్లు ధరించిన వాళ్ల వైభవానికి ఆశ్చర్యపడకుండా ఉండేవాళ్లం
మా జీవితాలు అమ్మకుండా ఉండేవాళ్లం
మా తలలు వంచకుండా ఉండే వాళ్లం
మా చేతులు జోడించకుండా ఉండే వాళ్లం
ఆ పాపిష్టి ఆడవాళ్లం మేమే!

ఎక్కడ మా శరీరాల పంటల్ని అమ్మేవాళ్లు ఉన్నతులైపోతారో
విశిష్టులైపోతారో
భౌతిక ప్రపంచానికి న్యాయమైన రాకుమారులైపోతారో
ఆ పాపిష్టి ఆడవాళ్లం మేమే!

రహదార్ల మీది అబద్ధాల అడ్డంకులకు వ్యతిరేకంగా
సత్యం బేనర్ ఎత్తుతూ బయటకు వచ్చేవాళ్లం
ప్రతి గడప మీదా పోగులు పడుతున్న ఉరితీతల కథల్ని చూసినవాళ్లం
మాట్లాడగలిగే నాలుకల్ని కత్తిరించడం చూసిన వాళ్లం
ఆ పాపిష్టి ఆడవాళ్లం మేమే!

ఇప్పుడు, రాత్రి తరుముకు వస్తున్నాసరే
ఈ కళ్లను ఆర్పడానికి వీల్లేదు.
కూలగొట్టబడిన ఆ గోడను
ఇప్పుడు మళ్లీ లేపాలని పట్టుపట్టకు
ఆ పాపిష్టి ఆడవాళ్లం మేమే!

గౌన్లు ధరించిన వాళ్ల వైభవానికి ఆశ్చర్యపడకుండా ఉండేవాళ్లం
మా జీవితాలు అమ్మకుండా ఉండేవాళ్లం
మా తలలు వంచకుండా ఉండే వాళ్లం
మా చేతులు జోడించకుండా ఉండే వాళ్లం
ఆ పాపిష్టి ఆడవాళ్లం మేమే!

## నాలో నేను మాట్లాడుకుంటూ

నన్ను శిక్షించు-
స్వప్న ప్రాముఖ్యాన్ని నా సొంత రక్తంలో వ్రాశాను కాబట్టి
ముట్టడి సవారి చేసే ఓ పుస్తకాన్ని వ్రాశాను కాబట్టి.

నన్ను శిక్షించు-
భవిష్యత్ స్వప్నాన్ని పవిత్రం చేయడం కోసం నా జీవితాన్ని గడిపాను కాబట్టి
రాత్రి ఆపదల్ని భరిస్తూ జీవితాన్ని గడిపాను కాబట్టి.

నన్ను శిక్షించు-
హంతకుడికి జ్ఞానాన్నీ, ఖడ్గ నైపుణ్యాన్నీ బోధించాను కాబట్టి
మనస్సుకి కలంశక్తిని నిరూపించాను కాబట్టి.

నన్ను శిక్షించు-
ద్వేషం ( మమ్మల్ని) శిలువవేయటాన్ని వ్యతిరేకించాను కాబట్టి
నేను ఎదురుగాలికి రగిలే కాగడాల కాంతిని కాబట్టి .

నన్ను శిక్షించు-
మోసపుచ్చిన రాత్రి పిచ్చితనంలోంచి స్త్రీత్వాన్ని విడిపించాను కాబట్టి.

నన్ను శిక్షించు-
నేను బ్రతికుంటే నీకు ముఖం చెల్లదు కాబట్టి.

నన్ను శిక్షించు-
నా కొడుకులు పిడికిళ్లెత్తితే నువ్వు అంతమౌతావు కాబట్టి
ఒకే ఒక ఖడ్గం మాట్లాడటంకోసం ఒర దూసుకొని వస్తే
నువ్వు అంతమౌతావు కాబట్టి.

నన్ను శిక్షించు-
క్రొత్త జీవితాన్ని ప్రతి ఉచ్ఛ్వాసంతోనూ నేను ప్రేమిస్తాను కాబట్టి
నా జీవితాన్ని నేను జీవిస్తాను కాబట్టి
నా జీవితానికి అవతల కూడా నేను జీవిస్తాను కాబట్టి.

నన్ను శిక్షించు-
అప్పుడు నీ శిక్షావిధి అంతమౌతుంది కాబట్టి.

(రుఖ్సానా అహ్మద్ ఉర్దూ నుండి ఆంగ్లంలోకి అనువదించిన " We Sinful Women" అనే కవితా సంకలనం ఆధారంగా - తంగిరాల)

---

''నాకు సౌగంధిక పుష్పం వద్దు
నేను ద్రౌపదినికాను
నాకు సత్యవంతుడి ప్రాణమూ వద్దు
నేను సావిత్రిని కాను
.....................
నన్ను నేను జయించకున్నదాన్ని
నేను ఈ నాటిదాన్ని!''

- జయప్రభ

పాకిస్తానీ కవయిత్రి :

# ఫహ్మీదా రియాజ్

## ఆమె నవ్వు

బండబారిన కొండరాళ్ల మధ్య
తన్నుకొచ్చే ఊటల్లో ఆమె కిలకిల ప్రతి ధ్వనులు
విత్తానికీ పెత్తనానికీ పేరు ప్రతిష్ఠలకీ విలువలేదక్కడ
ఆ శరీర గిరి సానువుల్లో
నిక్షిప్తమై ఉంది ఆమె స్వేచ్ఛ
దివి నుంచి భువికి దిగొచ్చిన
అదునాతన అధిదేవతల్లారా!
ప్రయత్నించి చూడండి-
ఆమె ఆనందోన్మాద ధ్వనుల్ని మీరు ఆలకించజాలరు
ఈ విపణి వీథిలో
ఆమె ఆనందానికి తప్ప
అన్నిటికీ గిరాకీ ఉంది.
ఆమె సైతం అమ్ముకోలేని ఆ నిక్షిప్తం జాడ
తనకు మాత్రమే తెలుసు.
లోయల్లో సుళ్లు తిరిగే మలయపవనమా!
ఒక్కసారి వచ్చి ఆమెను చుంబించి దయచేయి!!
అదిగో చూడండి-
కొండగాలి విసురుకు ఆమె కురులు తాండవమాడున్నాయి
పరమపావని ఆమె-
పవనాలతో శ్రుతి కలిపి సాగిపోతోంది.

(అనువాదం : 'ఎంకి')

# అనుబంధం

(కీ. శే. గుఱ్ఱం జాషువాగారి శతజయంతి సందర్భంగా.....
వారు ఏనాడో రచించిన ఒక గొప్ప స్త్రీ వాద కవిత)

# వంచిత

'కవి కోకిల', 'నవయుగ కవిచక్రవర్తి'

## గుఱ్ఱం జాషువా

**(1895-1971)**

# వంచిత

అమ్మా! భారతనారి! నీ కడుపునం దావిర్భవంబంది. నీ
యెమ్ముల్ బిండి సుఖించు పూరుషుల నిం కెన్నాళ్ళు సేవించి, కా
లమ్మున్ వ్యర్థము చేసికొందువు? కరాళ స్వార్థధర్మాలలో
గమ్మత్తున్ గనిపెట్టి స్త్రీజగము దుఃఖంబు న్నివారింపుమా!

ఇరువదినూరేండ్ల వయో
భరమున నడయుడు యణువుబాంబు యుగములో
తరుణీమణివై, కన్నులు
దెరువని నిను జూచి సర్వదిశలు హసించున్.

పురుషులు వంటయింటి కొరముట్టుగ నిన్ను గణించుచుండ, కి
క్కురుమనకుండ సంసరణకూపమునంబడి, మందభాగ్యవై
వరవుడమాచరించెదవు భారత పుత్రికనంచు రిత్తసం
బరపడుచుందు వింటి తలవాకిలి దాటని పుట్టు ఖైదివై.

అనసూయాదులు మూటగట్టుకొనినా రానాడు గం పంత చి
క్కని పుణ్యంబని వేదశాస్త్రములు వక్కాణించగా నమ్మి గొం
తున కుచ్చుల్ దగిలించు సంఘమును శార్దూలంబు వ్యక్తిమున్
దినుచున్నన్ జలియింప విప్పటి నింతీ! యెంత శాంతాత్మవో!

మగనికి మగువల గూరిచి
యగచాట్లంబడ్డ తొంటి యంగనలను, నా
భగవతులని పూజించెద వే
యెగతాళికొ లేక హృదయమే శూన్యంబో.

వలపులరాణిగా, చిలుకపల్కుల చక్కెర పిండిబొమ్మగా
యలికులవేణిగా బొగడి యాకసమందొక మేడగట్టి యా
యెలవిడి యూచు నిప్పురుషు డిన్నియుగంబులు నిన్ను కాళ్ళతో
నలుచుట లోనిగుట్టు లలనా! గ్రహింప విదేమి చిత్రమో.

హృదయం బెక్కడ నేడ్చె కాంతకనియో యింకేయభిప్రాయమో
హృదయేసుండనువాడు వో జిఋతనారి న్నిన్ను నీ యందమున్
బ్రదుకున్ బండలపాలు చేసెదరు నీ బాబుల్ దయాహీనులై
యెదురైన న్నిను దిట్టిపోతు రలివేణీ! ఘోర మెట్లోర్తువో!

సతి గతించిన యుత్తర క్షణమునంద
తరుణికోసర మూరూరు బరుగులెత్తి
ప్రేయసీ వియోగంబును విస్మరించు
స్వార్థులేకద నీ నమ్ము శాస్త్రగురులు?

పరదాలో నిను దాచిపెట్టుకొనుచున్ స్వాతంత్ర్య మావశ్యకం
బరవిందాక్షుల కంచు వీథుల నుపన్యాసాలు సాగించు ట
క్కరులే హైందవ కోడుబిల్లులకు పక్కా ద్వేషులై నిల్చుచుం
దురు, విద్యానయనంబు లేని యలివేణుల్ గాన రీ మర్మముల్.

ని న్నాకాశము దాకగా బొగడుచున్ నీ యందచందాలతో
వన్నెల్ దీర్చి కవిత్వ మల్లుకొనుచున్ పై పై పరామర్శలన్
నిన్నున్ నీదు శరీరమున్ హృదయమున్ ఛేదించి వేధించి యిం
తన్నంబుం బడవేయు సంఘమును బిడ్డా! యెట్లు హర్షింతువో?

పతి మరణింప నాతని శవంబునకున్ సతి నంటగట్టి స
ద్గతి లభియించునంచు కనికార మొకించుకలేక యగ్ని కా
హుతి యొనరించు తొంటి పురుషోత్తము డెన్నటికేని నీ సము
న్నతికి బ్రసన్నుడై వదలునా జిరకాలపు టుక్కుపగ్గముల్.

స్త్రీలను పుట్టు బానిసల జేసిన సంస్కృతి చెప్పు వారి గ్రం
థాలు పఠించి నాటకశతంబుల నారసి బండవారి యా
శాలత లెండియున్న జలజాక్షికి నీ కొక రీతిగా నప
థ్యాలయి గోచరించగల వధ్యతనార్యకవి ప్రబోధముల్.

అత్తమామల క్రూరమైన దాడికి లొంగి
పలుకాడరాని కోడలితనంబు

మగని యాయువులతో దెగి ముండమోయించి
గేలిగొట్టించు నిల్లాలితనము
పతి భక్తురాలన్న పద గౌరవము దక్క
సౌఖ్యం బెఱుంగని చానతనము
అన్నదమ్ములవోలి నాస్తిపాస్తులమీద
హక్కు లించుకలేని యాడుతనము
ఒక్క భరతవర్ష యువతీమణికి నీక
తగునటంచు బిట్టు బొగడుచుండు
మోసగాంఢ్ర నమ్మి పూజించు నిను జూచి
శిష్టజనుల కన్ను చెమ్మగిల్లు.

పాములు సంతానవరదాయకములంచు
ప్రార్థించు పెను వెఱ్ఱిబాగులమ్మ
ఔషధ సేవజేయక సత్తులకు మ్రొక్కి
ప్రాణాలు బలిపెట్టు పరమ మూఢ
కృతకంబులైన పుక్కిటి కథానకములు
సత్యంబులని మ్రొక్కు చపల హృదయ
వికట సాంఘిక శక్తులకు దేహ మర్పించి
తలవ్రాత కేడ్చు విద్యావిహీన
పసుపు రాయుచున్న ముసుగు బెట్టుచునున్న
మారు పలుకలేని మంద భాగ్య
ఖండ పంచకమున కలికంబునకు లేదు
తలపవేల? భావదాసురాల!

ఉక్కుపదాల సాంఘికపు టుగ్రపిశాచ మొనర్చు గర్జకున్
గ్రుక్కినపేనులై, ప్రతిభ గోల్పడి, పూరుష జాతి చేయు ను
చ్చెక్కుల స్తోత్రపాఠములచే బరితృప్తి వహించు నీకు నీ
నిక్కపు సానుభూతులవి నీతులు గావుగదా? సహోదరీ!

నీయెడ జాలిబూను మహనీయులు పుట్టరు, రామరాజ్యముల్
వేయి సముద్భవించి పదివేల స్వరాజ్యము లుప్పతిల్లినన్

తోయజ నేత్ర స్త్రీ జగము దుఃఖమువాపెడు శాసనాలకున్
నాయకులే విరోధులయినా రబలా! ప్రబలాపకారులై.

ఏనా డాడుది కూడుగుడ్డకొర్కై యీ క్రూర దాస్యాగ్నికిన్
మే నర్పించి బహిఃప్రపంచమునకున్ వేరై ప్రవర్తించెనో
ఆనా డాధిగ పిల్లపిల్ల తర మవ్యక్తంబునం గ్రుంగుచున్
నానా బాధల కగ్గమై నవయుచున్నారమ్మ! బింబాధరల్.

పిల్ల ల్లేరని వంక బెట్టుకొని నీ ప్రేమన్ విసర్జించి, మా
రిల్లాలిన్ గొనివచ్చి నీదు తలపై నెక్కించి, నీ పక్కలో
బల్లెంబున్ సవరించు దుష్టులకు బ్రాపై వచ్చు ధర్మాలెటుల్
జెల్లన్ నేరవా నీవు కొండొక పతిన్ జే పట్టి పెండ్లాడినన్.

సహగమనాచార దహనంబు చల్లార్చి
నట్టి శ్రీ రామ మోహనునిమీద
విధవల నోదార్చి పెండిండ్లు జేసిన
వీరేశలింగ కోవిదునిమీద
అతి బాల్య వైవాహికాచార ముడిపిన
హరిబిలాలను గుణోత్తరునిమీద
కన్నబిడ్డలను గంగాదేవి కర్పించు
దొసగుమాన్పిన సీమదొరలమీద
పండ్లు నూరిన పీఠికాస్వాము లిపుడు
సలుపుచున్నారు శాసనసభలముందు
ఘోర శపథాలతో నిరాహారదీక్ష
బల్లులను మ్రింగు పెను జంగుబిల్లులగుచు.

మాయాడుంగుల శీలమే భరత సంపద్దాయకంబంచు, స్వా
ర్థాయత్తుల్ పురుషుల్ విదేశముల మధ్యన్ బిట్టు యూరింపగా
కాయంబుల్ పులకించి మెచ్చెదరు మీ కష్టాలు గు ర్తింపలే
కా యీ దేశప్రజల్, ప్రచారమున మిథ్యల్ తథ్యముల్ గావొకో!

భారతదేశ సంస్కృతికి భంగము వాటిలునంచు విద్యకున్
దూరము జేసి మీ బ్రదుకు దోపిడిచేయుటచేత లక్ష్యమున్
జేరక యన్యఖండముల శేముషికిన్ గను లప్పగించి ని
ట్టూరుపుల న్నిగుడ్తురు సహోదరి! నేటి స్వతంత్ర మానవుల్.

అనివార్యంబగు యౌవనం బుబికి సర్వాంగంబులన్ నిండి, వె
చ్చని రక్తంబును రెచ్చగొట్టి మధురేచ్ఛల్ రేగి వేధింప, తీ
రని వైధవ్యదవాగ్నిలోన బడి మర్మచ్ఛేదకంబైన వే
దనపాలై వ్రతముల్ పొనర్చెడు ననాథా! నీకు శ్రద్ధాంజలుల్.

దయ్యంబు పూనకంబయ్యె నాకని లేచి
నగ్నతాండవమాడు భగ్న చిత్త
గడ్డాలు మీసాలు గల్గి ఖోజ్జాయైన
భర్తతో గలహించు బాలయువతి
కృపలేని మగని అంపపుకోత బడలేక
యురిబోసికొని దేహ మూడ్చు తరుణి
అత్తమామల క్రూరమైదాష్టకంబు
నోర్వక చిచ్చులో నురుకు రమణి
కరుణలేని శాస్త్రకారుల క్రోధాగ్ని
గుండమునకు మేలి గుగ్గిలాలు
కఱకుకాపురాల కెఱయైన వనితల
గణ్యరత్నఖనులు, పుణ్యవతులు.

'' మగడనువాడు ప్రేయసి నమానుష హింసలుపెట్టి కొట్టుటల్
మగువకు సౌఖ్యహేతువు సుమా'' యని వాదనసేయు నీతిపా
రగులగువారునుం గలుగు రాజ్యము నీ దగు వేడియూరుపుం
బొగల గరంగునా? బిగిసిపోయిన యుచ్చుల నూడదీయునా?

అబలయన్న బిరుద మంటించి కాంతల
స్వీయశక్తు లదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడనచేసికొమ్ము కష్టచరిత!

# చైతన్య కవితా వేదిక

## బెంగుళూరు

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ టి. పట్టాభిరామిరెడ్డి (పఠాభి) |
| అధ్యక్షులు | : | శ్రీ డి. కె. ఆదికేశవులు |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ. ఎ. ఎస్. |
| | | శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి |
| | | శ్రీ కె. పి. రావు |
| | | శ్రీ వై. వి.వెంకటేశ్వరరావు |
| | | శ్రీ జె. బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్ |
| కార్యదర్శులు | : | ఆచార్య తంగిరాల సుబ్బారావు |
| | | డా. ఆర్వీయస్. సుందరం |
| సహకార్యదర్శులు | : | డా. దివాకర్ల రాజేశ్వరి |
| | | డా. పి. యు .బి. శర్మ |
| | | డా. కె. చంద్రప్ప |
| | | డా. ఎం. రుక్మాంగద నాయుడు |
| | | శ్రీ వి. రామనరసింహారెడ్డి |
| కోశాధికారి | : | ఆచార్య సరగు కృష్ణమూర్తి |

---

**1995 లో చేరిన చందాదారులు**

**పోషకులు :**

శ్రీ యం. వెంకటపతినాయుడు, చిత్తూరు
శ్రీ కె. పి. రావు, బెంగుళూరు
డా. గాలిరాజేశ్వరి, శ్రీ సంగాపు జయచంద్రనాయుడు, గుంతకల్లు

**జీవిత సభ్యులు :**

శ్రీ వి.వి. సుబ్రహ్మణ్య శర్మ, హైదరాబాదు

శ్రీ సి. తాండవ కృష్ణ, విజయవాడ

డా. జి. సహదేవుడు, నంద్యాల, కర్నూలు జిల్లా

శ్రీ గుండా సత్యనారాయణ, బేతంచర్ల, కర్నూలు జిల్లా

శ్రీమతి కె. అన్నపూర్ణ, శ్రీ కె. సుబ్బారెడ్డి దంపతులు, న్యూఢిల్లీ

కుమారి పానుగంటి మాధవి, బెంగుళూరు

శ్రీ బి.వి.యస్.యస్. మణి, మద్రాసు

శ్రీ దుత్తా బాబూరావు, హైదరాబాదు

శ్రీ ఎం. వి. యన్. యల్. ప్రసాద్, ఒంగోలు

శ్రీ విశ్వనాథపావని శాస్త్రి, విజయవాడ

**ప్రత్యేక సభ్యులు :**

డా. పి. స్వరాజ్యలక్ష్మి, పరచూరు, ప్రకాశం జిల్లా

డా. యస్. సంజీవదేవ్, తుమ్మపూడి, గుంటూరు జిల్లా

డా. గాలిగుణశేఖర్, పుత్తూరు, చిత్తూరు జిల్లా

డా. అల్లాడి ఉమ, శ్రీ ఎం. శ్రీధర్, హైదరాబాదు

శ్రీ కె. బాలకృష్ణ

డా. సి. పెద్దిరెడ్డి, హిందూపురం, అనంతపురం జిల్లా

శ్రీ మేడిశెట్టి తిరుమల కుమార్, బెంగుళూరు

డా. అనుమండ్ల భూమయ్య, వరంగల్లు

శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, హైదరాబాదు

ఆచార్య తిరుమల, హైదరాబాదు

శ్రీ మోదు రాజేశ్వరరావు, విశాఖపట్టణం

శ్రీ కె. అనంత్, మచిలీపట్టణం

శ్రీ మత్తిగిరి సుబ్రహ్మణ్యం, హోసూరు కాటిల్ ఫారం
ధర్మపురి జిల్లా, తమిళనాడు

డా. ముదిగంటి సుజాతారెడ్డి, హైదరాబాదు

శ్రీ ఎం. కె. మూర్తి, సిద్ధార్థ ఎడ్యుకేషనల్ సొసైటీ, రాజమండ్రి

ఆచార్య కె. జె. కృష్ణమూర్తి, తిరుపతి
డా. ముదివేడు ప్రభాకరరావు, తిరుపతి
డా. బి. భాస్కర చౌదరి, మదనపల్లె
శ్రీ సి.వి. నాగేశ్వరరావు, విజయవాడ
శ్రీమతి వాడ్రేవు వీరలక్ష్మీదేవి, కాకినాడ
డా. యన్. సురేంద్ర, సంగారెడ్డి, మెదక్ జిల్లా
శ్రీ రావి రంగారావు, మచిలీపట్టణం
శ్రీ వేమూరి హరిబాబు, మచిలీపట్టణం
శ్రీ పి. శివరామశర్మ, నల్లగొండ
శ్రీమతి వాడ్రేవు రమాదేవి, రాజోలు, తూర్పుగోదావరి జిల్లా
శ్రీ కపిలవాయి కిశోర్‌బాబు, నాగర కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా
డా. మల్లెల గురువయ్య, మదనపల్లె
శ్రీ ఎన్. బాలసుబ్రహ్మణ్యం, ఈడుమూడి, ప్రకాశం జిల్లా
శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి, ఒంగోలు
శ్రీ గిడుగు రాజేశ్వరరావు, హైదరాబాదు
శ్రీ అత్తిలి వెంకటరమణ, నూజివీడు, కృష్ణాజిల్లా
శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, కాకినాడ
డా. జె. బాపురెడ్డి, హైదరాబాదు
శ్రీ రసరాజు, నన్నయభట్టారకపీఠం, తణుకు
శ్రీ సుశర్మ, నన్నయభట్టారకపీఠం, తణుకు
డా. టి. రాజేశ్వరశర్మ, తిరుపతి
శ్రీ మధురాంతకం రాజారాం, దామల్‌చెరువు, చిత్తూరు జిల్లా



రావులపల్లి సునీత



శికాకొల్లు లక్ష్మీమోహన్



ఆదూరి సత్యవతీ దేవి

# చైతన్యకవిత



కీ.శే. టి. స్నేహలతారెడ్డి

చైతన్య కవితా వేదిక బెంగళూరు